# శ్రీ సువర్చలా సుందర వాయునందన శతకము

## తుమ్మోజు రామలక్ష్మణాచార్యులు

ప్రచురణ:

**సరసభారతి**

ఉయ్యూరు, కృష్ణాజిల్లా

# Sri Suvarchalaa Sundara Vaayunandana Satakam

by

**Thummoju Rama lakshmanacharyulu**

First Edition: **Fubruary 5 2017**

Copies: 1000



Price. Rs.**30/-**

Cover Design: **Kalasagar**

For Copies: **Gabbita Durga Prasad**
President, "Sarasabharathi"
H.No.2-405, Sivalayam Street,
Near Raja gari kota, Vuyyuru- 521 165
Krishna Dist. Phone:08676- 232797
Cell: 9989066375
e-mail: gabbita.prasad@gmail.com
sarasabharati.vuyyuru@gmail.com
http/sarasabharati.wordpress.com
http/suvarchalanjaneyaswamy.wordpress.com

Type Setting: **"Ramya Bharathi"** vja

Printed : **Rainbow Graphics,** vijayawada-2

# శ్రీ సువర్చలాంజనేయస్వామి వారలకు
# అంకితం

- గబ్బిట దుర్గాప్రసాద్




## శ్రీ ఆంజనేయ హారతి

1. నిరాకార నిరంజనా నీకు హారతీ– ఆంజనేయ స్వామికి మనసు హారతీ – నిరాకార .. పంచ భూతములను అయిదు ప్రమిదలుగాను చేసినాను –మించి పోయే గుణము తీసి వంచి వత్తి వేసినాను –నిరాకార
తామసమనే గుణము తీసి తరచి చమురు పోసినాను –దూషణ మనే గుణము తీసి దీపము వెలిగించినాను 'నిరాకార మాయ యనే తెరను తీసి మల్లె పూల పూజ చేసి – అహంకార మనే గుణము తీసి 'అక్షింతలు వేసినాను –నిరాకార
కామ క్రోధములను తీసి కైవత్తీ చేసినాను –ఈషణ మనే గుణము తీసి దక్షిణ గావించి నాను –నిరాకార
భక్తులా హృదయ వాస భవ్య హారతి – ఉయ్యూరు పుర నివాస పరమ హారతి
నిరాకార నిరంజనా నీకు హారతీ – ఆంజనేయ స్వామికి నా మనసు హారతి .

## సంక్షిప్త శ్రీ సుందర కాండ

1. తతో గృధ్ర స్య వచనాత్ - సంపాతేర సుమాన్ బలీ
శత యోజన విస్తీర్ణం- పుప్లువే లవణార్ణవం.

2. తత్ర లంకౌ సమాసాద్య - పురీం రావణ పాలితాం
దదర్శ సీతాంధ్యాయంతీం-అశోక వనికాం గతం .

3. నివేదాయిత్వాభిజ్ఞాతం - ప్రవృత్తిం చ నివేద్యంచ
సమాశ్వాస్య చ వైదేహీం - మర్ద యామాస తోరణం.

4. పంచ సేనాగ్రగాన్ హత్వా - సప్త మంత్రి సుతానపి
శూర మక్షం చ నిష్పష్య - గ్రహణం సముపాగమత్.

5. అస్త్రే ణోన్ముక్తమాత్మానం -జ్ఞాత్వా పైతామహ ద్వరాత్
మర్షయన్ రాక్షసాన్ వీరో - మంత్రి ణస్తాన్ యదృచ్ఛయా.

6. తతో దగ్ధ్వా పురీ లంకాం-ఋతే సీతాంచ మైథిలీం
రామాయ ప్రియ మాఖ్యాతుం - పునరాయా న్మహా కపిః.

7. సో భి గమ్య మహాత్మానం - కృత్వా రామం ప్రదక్షిణం
న్య వేదయ దమేయాత్మా- దృష్టా సీతేతి తత్వతః

## స్వామికి చంపక ఉత్పల సేవ

**- డా. శ్రీ తూములూరు శ్రీ దక్షిణామూర్తి శాస్త్రి**

1. తలచిన వారికిన్ బలము ధైర్యము, బుద్ధి, యశంబశేష వి
ద్యలు, నభయం బరోగ, మమృతత్వ మజాడ్య ము, వాక్పటుత్వము,
జ్వల గతి గూర్చు దైవము, నవగ్ర పరాక్రమము నాంజనేయునిన్
గొలుతు, సువర్చలా సహితు, గూరిమి బ్రోవగ నెల్ల వేళలన్.

2. శ్రీ రఘురాము గొల్చి, ధృతి సీతకు శోక మెడల్చి, భీకరా
కారుల దైత్యుల గెలిచి, కవలు రావణు హెచ్చరించి, యం
గారము దాల్చి, పట్టణము గాల్చి, జయంబు గడించు వీరు, "దు
య్యూరు" "పురంబు నందు కొలువుండు సువర్చలతో గృపామతిన్"

# శ్రీ సువర్చలాంజనేయ స్వామి దేవాలయం
# ఉయ్యూరు

## ఆలయ పూర్వ చరిత్ర

కృష్ణాజిల్లా ఉయ్యూరులో రావిచెట్టు బజారులో వేంచేసి యున్న శ్రీ సువర్చలాంజనేయస్వామి దేవాలయానికి గబ్బిట వారి దేవాలయం అని పేరు సుమారు మూడు వందల ఏళ్ళక్రితం ఈ ఆలయాన్ని మా నాన్నగారు మృత్యుంజయ శాస్త్రి గారి మాతామహులు అంటే మా నాయనమ్మ నాగమ్మగారి తండ్రి గారు గుండు లక్ష్మీనరసింహావదానులుగారు స్వంత ఖర్చులతో నిర్మించి, ధూప దీప నైవేద్యాలకు ఏర్పాటు చేశారు. ఉత్సవమూర్తులను కూడా ఏర్పాటు చేసి ధ్వజ స్థంభ ప్రతిష్ట కూడా చేశారు. వైశాఖ బహుళ దశమి శ్రీ ఆంజనేయస్వామి జన్మదినం నాడు శ్రీ హనుమజ్జయంతిని, శ్రీ సువర్చలాజనేయ స్వామి వారల కల్యాణాన్ని వైభవంగా జరిపేవారు. కోరిన కోరికలు తీర్చే దైవంగా స్వామి సుప్రసిద్ధుడు. అందరికీ అండా దండా. ఆవరణలో ఈశాన్యాన ఎత్తైన కళ్యాణ మండపం ఉండేది. అర్చక స్వాములు స్వామి సేవ శ్రద్ధగా చేసేవారు. నరసింహా వధానులు గారిమరణం తర్వాత దౌహిత్రులైన మా తండ్రిగారు ఆలయానికి వంశపాంపర్య ధర్మకర్తగా ఉండి కార్యక్రమాలన్నీ యధా విధిగా నిర్వహించేవారు. ఆలయం బాగా ముందుకు ఉండి, వెనక ఎక్కువ ఖాళీ ఉండటం వలన ఎక్కువ మందికి దర్శన భాగ్యం కలిగేదికాదు. జయంతి, కల్యాణం తప్పక జరిగేవి. ఈలోగా ముందున్న రోడ్డు ఎత్తు పెరగటం, ఆలయం లోతుగా ఉండటంతో వర్షాకాలంలో నీరంతా ఆలయం లోనే ఉండి చాలా ఇబ్బందిగా ఉండేది. 1961లో మా తండ్రి గారి నిర్యాణం తర్వాత నేను వంశ పారంపర్య ధర్మకర్తగా ఉంటున్నాను. ఆలయం శిధిలమై పోతోంది. ఇరుకై బాధగా ఉంది. ఎన్నోసార్లు మంచి ఆలయం నిర్మించాలని అనుకొన్నాము. మా ఒక్కరి వలన అయ్యేపని కాదు. అందరి సహకారం కోసం ప్రయత్నించాము. కాని స్వామి అనుగ్రహం కలగలేదు. నిత్య ధూప దీప నైవేద్యాలు యదాప్రకారంగా ఆలయం నిర్మించి నాటి నుండి ఏ లోపమూ లేకుండా యధాప్రకారంగాజరుగుతూనే ఉన్నాయి. స్వామిపై అచంచల విశ్వాసం భక్తులకు ఉండేది. బాలభక్తులు కూడా శ్రద్ధగా స్వామి సేవ చేసేవారు.

## నూతన ఆలయ నిర్మాణం

రోడ్డుకు దక్షిణ భాగంలో పుల్లేరు కాలువపై వంతెన నిర్మించారు. అప్పుడు మా కుటుంబ సభ్యులకు, శ్రేయోభిలాషులకు, గ్రామస్తులకు బలీయమైన ఆలోచన కలిగి

స్వామి అనుగ్రహం తోడై ఒక కమిటీ ఏర్పడి ఆలయం నిర్మించాలని దృఢమైన సంకల్పం కలిగింది. వరుసగా సమావేశాలు నిర్వహించటం, చందాలు వసూలు చేసి రసీదులిచ్చి వచ్చిన ధనాన్ని బ్యాంకులో వేయటం చేశాము. దీనికి నాకు పూర్తి సహకారం అందించిన వారు స్వర్గీయ మండా వీరభద్రరావు, శ్రీ లంకా సంజీవరావు గార్లు. కాలికి బలపం కట్టుకొని మేం ముగ్గురం కలిసి తిరిగి మంచి సహకారాన్ని సంపాదించాం. స్వచ్ఛందంగా భక్తులు విరాళాలు ఇచ్చారు. పని ప్రారంభించటానికి తగిన ధనం చేకూరింది. శ్రీ కొల్లి సుబ్బారావుగారు నిర్మాణ పర్యవేక్షణ చేశారు. స్వస్తిశ్రీ చాంద్రమాన పరాభవ నామ సంవత్సర నిజ జ్యేష్ఠ నవమీ గురువారం హస్తా నక్షత్రయుక్త కర్కాటక లగ్న పుష్కరాంశ యందు 23-6-1988 స్వామివారి ఆలయ పునః ప్రతిష్ఠ కార్యక్రమం వైఖానస ఆగమ విధానంలో శ్రీ వేదాంతం రామాచార్యులవారి ఆధ్వర్యంలో నేనూ, నా భార్య శ్రీమతి ప్రభావతి దంపతులం శ్రీ స్వామివారి విగ్రహ ప్రతిష్ఠ చేశాము. ఆనాటి కె.సి.పి.ప్లాంట్ మేనేజర్ స్వర్గీయ శ్రీ ఇంజేటి జగన్నాధరావు గారు, శాసనసభ్యులు శ్రీ అన్నే బాబూరావు గారు ముఖ్యులుగా విచ్చేసి కార్యక్రమానికి ఘనత చేకూర్చారు. కె. సి.పి.వారి వదాన్యత, పరిసర గ్రామస్తుల దాతృత్వం, సహాయం మరువలేము. ఉయ్యూరులో ఊర, పువ్వాడ, వెంట్రప్రగడ, చోడవరపు, మండా మొదలైన కుటుంబాల వారు, వారూ వీరూ అనేమిటి అందరూ పెద్ద మనసుతో ఈ పవిత్ర భగవత్ కార్యక్రమానికి సహకరించి అండగా నిలిచారు. ఉత్సవ విగ్రహాలతో ఆలయం శోభించింది. ఉచితంగా కొందరు లారీలతో ఇసుక తోలితే, కొందరు సిమెంట్ బస్తాలు ఇచ్చారు. స్వామిపై ఉన్న అచంచల విశ్వాసమే మా అందరి చేత ఇంతటి బృహత్కార్యక్రమాన్ని చేయించింది. మాకుటుంబ సభ్యులు ధనంతో, సేవలతో సహకరించారు.

## ధ్వజ స్తంభ ప్రతిష్ఠ

ధనలోపం వలన ధ్వజస్తంభం నిర్మించలేక పోయాం. అయినా ప్రతి ఏడాది శ్రీ హనుమజ్జయంతిని కల్యాణాన్ని పరమ వైభవంగా నిర్వహిస్తూ తరించాము. భక్తులు విపరీతంగా పెరిగారు. ధనుర్మాస కార్యక్రమాలు ప్రారంభించాము. మార్గశిర శుద్ధ త్రయోదశి నాడు శ్రీ హనుమద్ వ్రతం 3 రోజుల కార్యక్రమంగా నిష్ఠగా నిర్వహిస్తున్నాం. చిన ఒగిరాల వాస్తవ్యులు వదాన్యులు స్వర్గీయ శ్రీ పాలడుగు నాగేశ్వరదాసు గారు ధ్వజస్తంభాన్ని ప్రదానం చేశారు. స్వస్తిశ్రీ చాంద్రమాన శ్రీ మఖ నామ సంవత్సర జ్యేష్ఠ బహుళ నవమి 13-6-1993 ఆదివారం ఉదయం 07-29 గం.లకు ఉత్తరాభాద్ర నక్షత్ర యుక్త మిధునలగ్న పుష్కరాంశయందు ఇత్తడి తొడుగుతో సహా ధ్వజ ప్రతిష్ఠా మహోత్సవం అత్యంత వైభవంగా కన్నుల పండువుగా జరిగింది. స్వర్గీయ శ్రీ దొడ్డా వెంకటరత్నం దంపతులు శ్రీ పరాశరం రామకృష్ణమాచార్యులు గారి ఆధ్వర్యంలో ధ్వజ

ప్రతిష్ఠ చేశారు. శ్రీ మండా వీరభద్రరావు శ్రీ లంకా సంజీవరావు గారల అవిశ్రాంత కృషి, అనుక్షణ పర్యవేక్షణ నాకు కొండంత బలం. వారి సేవలు చిరస్మరణీయాలు. మరెందరో వదాన్యుల సహకారం నాకు ఆత్మ బలాన్నిచ్చి కార్యక్రమం దిగ్విజయం చేయటానికి తోడ్పడింది.

## నిత్యకల్యాణం పచ్చతోరణం

ఇప్పుడు నిత్యం వందలాది భక్తులు శ్రీ సువర్చలాంజనేయస్వామి వారలను దర్శించి, సేవించి, తరిస్తున్నారు. మంగళవారం, శనివారాలలో నాగవల్లీ (తమలపాకు) పూజ విశేషంగా జరుగుతుంది. ధనుర్మాసంలో నెలరోజులూ వేలాది భక్తులు ఆలయ ప్రదక్షిణం చేసి, తమ మనోభీస్టాన్ని స్వామికి నివేదించుకొని అభీష్టసిద్ధి పొందుతున్నారు. ప్రాతః కాలపూజ, తిరుప్పావై, శ్రీ సుందర కాండ, కులశేఖర్ ఆళ్వార్ వారి ముకుందమాల స్తోత్ర పారాయణలతో ఆలయం శోభాయమానంగా ఉంటోంది. స్వామిభక్తుల పాలిటి కొంగుబంగారం. భోగినాడు శాకంబరీపూజ శ్రీ సువర్చలాంజనేయ, శ్రీ గోదారంగ నాద స్వాములకు శాంతి కల్యాణం నిర్వహిస్తాం. ఇత్తడి ఒంటె వాహనంపై గ్రామోత్సవం నిర్వహిస్తాం. ప్రతి ఏడాది జనవరి 1 నూతన ఆంగ్ల సంవత్సరం నాడు ఉదయాన్నే స్వామివారికి లడ్డూలతో ప్రత్యేక పూజచేసి, ప్రసాదంగా భక్తులకు అందజేస్తాము. జనవరి 10న అరిసెలతో విశేష పూజ చేసి ప్రసాదంగా ఇస్తాము. స్వామికి గారెల దండ (వడమాల) సర్వ సాధారణ విషయమే. ఎప్పుడూ భక్తులు చేయించి వేయిస్తూనే ఉంటారు. స్వామికి అత్యంత ప్రీతికరమైన అప్పాలు ప్రతి మంగళవారం చేయిస్తాము. తులసిమాలలు, నిమ్మకాయ మాలలు, తెల్లజిల్లేడు వేర్లతో, జిల్లేడుపువ్వులతో, పుష్పహారాలతో స్వామి దేదీప్యమానంగా ఉంటాడు. భజనలు కోలాటాలు, హనుమాన్, లలితా, విష్ణు సహస్ర నామ పారాయణాలు, సామూహిక కుంకుమ, గంధ సిందూరం పూజ మా ఆలయం ప్రత్యేకత. స్వామి జన్మనక్షత్రం పూర్వాభాద్రా నక్షత్రంనాడు మన్యు సూక్తంతో అభిషేకం జరుగుతుంది. వైశాఖ బహుళ దశమినాడు శ్రీ హనుమ జ్జయంతిని మూడురోజుల కార్యక్రమంగా త్రయాహ్నికంగా నిర్వహిస్తాము. మొదటి రోజు గంధ సిందూరంతో, మల్లెపూలతో, రెండవరోజు మామిడి పండ్లతో, (రసం మామిడిపళ్ళు) మూడవరోజు శ్రీ హనుమత్ జయంతినాడు తమలపాకులతో ప్రత్యేక పూజ, స్వామివార్ల శాంతి కల్యాణం నిర్వహిస్తాం. అలాగే శ్రీ హనుమద్ వ్రతమూ మూడు రోజులు చేసి ఒక రోజు అరటిపండ్లతో మరో రోజు చామంతి మొదలైన పూలు, గంధ సిందూరంతో, వ్రతం నాడు తమలపాకులతో విశేష పూజ జరుపుతాము. ప్రతి ఏడాదీ శ్రీరామ నవమికి సీతారామ కల్యాణం, శ్రీకృష్ణాష్టమి వేడుకలు, శంకర జయంతి, కార్తీక దీపాలం కరణ మాఘమాసంలో ఉచిత సామూహిక సత్యనారాయణ వ్రతం, దసరా నవరాత్రులలో సాయంత్రం పూట ప్రత్యేక పూజ, అమ్మవారికి వివిధ అలంకారాలు, విజయదశమి

నాడు శమీ పూజ చేస్తాం. ఇలా ఆలయం నిత్యకళ్యాణం పచ్చతోరణంగా అభివృద్ధి చెందుతోంది. ధనుర్మాసంలో అపర వైకుంఠంలాగా, నవరాత్రులలో సకల శక్తి యుతుడు, ప్రదాత స్వామి శక్తిస్వరూపిణి అయిన శ్రీ లలితాపరమేశ్వరి కొలువైన అపరశక్తి క్షేత్రంగా కార్తీక మాసం అపర కైలాసంలా ఆలయం భాసిస్తుంది. స్వామి శివ, విష్ణు, శక్తి అంశ సంభూతుడు కదా. ఆలయంలో ఉగాదిఉదయం పంచాంగ శ్రవణం, సంక్రాంతి ఉదయం సంక్రాంతి పురుషుని స్వరూప స్వభావ వివరణ ఉంటాయి.

## ప్రత్యేక కార్యక్రమ నిర్వహణ

2012లో ఆలయ నిర్మాణం జరిగి 20ఏళ్ళు అయిన సందర్భంగా 11 రోజుల ప్రత్యేక అకార్యక్రమం నిర్వహించాం. ప్రతి రోజు ఉదయం మన్యు సూక్తంతో స్వామివారలకు అభిషేకం, హోమం, సహస్ర నామార్చన, సాయంత్రం మళ్ళీ హోమం, శాంతి కల్యాణం నిర్వహించాం. భక్తుల స్పందన అపూర్వం. గీతామందిరం అర్చక స్వాములు శ్రీ స్వర్ణ నాగేశ్వరరావుగారి ఆధ్వర్యంలో ఈ కార్యక్రమాలు ఏలూరు వేదపండితులు అత్యంత శ్రద్ధాసక్తులతో మహావైభవంగా మాతో నిర్వహింపజేశారు. మా దంపతులతో పాటు రోజూ ఒకరిద్దరు దంపతులు శాంతి కల్యాణంలో పాల్గొని మహద్భాగ్యంగా భావించారు. 2015లో 5 రోజులపాటు శ్రీ హనుమజ్జయంతిని ఉదయం హోమం పుష్ప యాగం, మామిడిపళ్ళ పూజ, నిత్య కల్యాణంతో నిర్వహించాం. జయంతి రోజున నేను రాసిన "దర్శనీయ ఆంజనేయ దేవాలయాలు" గ్రంథావిష్కరణ చేశాం. 2016 శ్రీ హనుమజ్జయంతిని నిత్యసాయం కల్యాణంతో 3 రోజులు చేశాం. సరసభారతి కార్యక్రమాలు ఎక్కువ భాగం ఆలయంలోనే నిర్వహిస్తాం. ఆలయంలో ఏ కార్యక్రమం తలపెట్టినా భక్తులు ఆసక్తిగా ముందుకువచ్చి, అన్ని విధాలా సహాయ సహకారాలు అందజేసి జయప్రదం చేస్తారు. అర్చకస్వామి చి॥ వేదాంతం మురళీకృష్ణ బాధ్యతగా కార్యక్రమాలు భక్తులకు సంతృప్తి కలిగేట్లు నిర్వహిస్తాడు. ఈ ఏడాది ధనుర్మాసంలో జనవరి 10వ తేదీ మంగళవారం నాడు మొట్టమొదటి సారిగా ప్రాతఃకాల పూజలో నవనీతం (వెన్న)తోమూల విరాట్‌కు అభిషేకం నిర్వహించి, తరువాత సువర్చలాంజనేయ స్వాములకు అరిసెలతో ప్రత్యేక పూజ నిర్వహించాము.

## శ్రీ సువర్చలాంజనేయ స్వామి శతక త్రయం

ఎంతో కాలంగా స్వామిపై శతకం రాయించాలని అనుకొంటున్నాము. ఇన్నాళ్ళకు, ఇన్నేళ్ళకు స్వామి అనుగ్రహం వలన ఒకేసారి మూడు శతకాలను రాయించే అవకాశం వచ్చింది. శ్రీ సువర్చలాంజనేయస్వామి వారలపై శ్రీ తుమ్మోజు రామలక్ష్మణాచార్యులు గారిచే "శ్రీ సువర్చలా సుందర వాయునందన శతకం", మధురకవయిత్రి శ్రీమతి ముదిగొండ సీతారావమ్మగారిచే "శ్రీసువర్చలా వల్లభశతకం" శ్రీ మంకు శ్రీను గారిచే "శ్రీ సువర్చలేశ్వర శతకం" రాయించి, సరసభారతి ప్రచురించి 5-2-17 ఆదివారం

మాఘ శుద్ధ నవమినాడు ఉదయం 8 గం.లకు ఆలయంలో సామూహిక పాలు పొంగింపు కార్యక్రమం, ఉదయం9 గం.లకు సామూహిక శ్రీ సత్యనారాయణస్వామి వ్రతం నిర్వహించి ఉదయం 11.30 గం.కు పై శతక త్రయాన్ని స్వామి సమక్షంలో ఆవిష్కరించి శతకకర్తలైన పై "కవిత్రయం"కు సన్మానం నిర్వహిస్తున్నాం. ఈ త్రయంతో సరసభారతి ప్రచురణల సంఖ్య 25కు చేరిందని మనవి చేస్తున్నాము.

భక్తులందరూ శతక ముద్రణలో భాగస్వాములవ్వాలని మా అభిప్రాయం. అందుకని మొదటి శతకకం "శ్రీ సువర్చలా సుందర వాయునందన శతకం" ముద్రణకు 100 రూపాయలు, ఆపై విరాళం అందించిన భక్తుల పేర్లు, గోత్రం శతకంలో ప్రచురిస్తామని ముందుగానే తెలియజేశాము. భక్తులు ఎంతో ఉత్సాహంగా ముందుకు వచ్చి సహకరించి పేర్లు నమోదు చేసుకొన్నారు. వారందరికీ కృతజ్ఞతలు. గోత్రం తెలుపని వారికి, తెలియని వారికి స్వామిగోత్రం "కౌండిన్యస" గోత్రంగా పేర్కొన్నాం. సరస భారతి పైనా, స్వామి పైనా ఆసక్తి, భక్తీ ఉండి, అనేక కార్యక్రమాలలో సహకరించి, అడగకుండానే భారీ విరాళాలు ఇదివరకే అందజేసినవారు, పుస్తక ముద్రణకు తోడ్పడిన వారందరి గోత్రనామాలతో ఈ శతకంలో పేర్లు ఉండాలని భావించి వారందరినీ వారికి తెలియ జేయకుండానే చేర్చాము. వారంతా మా ఆత్మీయ భక్త బాంధవులే. రెండవ శతకం "శ్రీ సువర్చలా వల్లభ శతకం"కు శ్రీ గోవిందరాజు శ్రీనివాస్, శ్రీ వేణు మాధవ్ సోదరులు తమ తండ్రి గారు స్వర్గీయ గోవిందరాజు పరబ్రహ్మానందశర్మ గారి జ్ఞాపకార్థం స్పాన్సర్లుగా ఉండటానికి ముందుకు వచ్చారు. వారికి ధన్యవాదాలు. మూడవ "శ్రీ సువర్చలేశ్వర శతకం"ను ఆలయం తరఫున ముద్రిస్తున్నాము. మూడు శతకాలను శ్రీ సువర్చలాంజ నేయ స్వామి వారికే అంకితమిస్తున్నాము. కోరినదే తడవుగా అంగీకరించి, అనుకొన్న సమయానికి, ఈ శతక త్రయాన్ని భక్తిభావ బంధురంగా రచించిన అనుకొన్న సమయానికి అందజేసిన పై కవి త్రయానికి కృతజ్ఞతలు తెలియజేస్తున్నాం. వారి మాటలలోనే "స్వామి మా హృదయాలలో ప్రవేశించి మాతో రచింప జేశాడు"అని వారు వెలిబుచ్చిన అభిప్రాయం వారి భక్తికే కాక వినయానికి కూడా తార్కాణం. ఈ శతకాలకు మేము కోరిన విధంగా కవర్ పేజీలు డిజైన్ చేసిన ఆర్టిస్ట్ శ్రీ కళాసాగర్, డి.టి.పి.చేసి ముద్రింపజేసి అంద జేసిన శ్రీచలపాక ప్రకాష్ గార్లకు ధన్యవాదాలు. ఈ భక్తి సాహిత్య యజ్ఞంలో సహకరించిన వారందరికీ శ్రీ సువర్చలాంజనేయస్వామి వారల కరుణా కటాక్షం లభించాలని కోరుకొంటూ "ఎందరో మహాను భావులు అందరికీ వందనములు".

**– గబ్బిట దుర్గాప్రసాద్**

సరస భారతి, అధ్యక్షులు

మరియు శ్రీ సువర్చలాంజనేయస్వామి దేవాలయ ధర్మకర్త



# హనుమను కీర్తించిన రామలక్ష్మణులు

శ్రీయుతులు తుమ్మోజు రామలక్షణాచార్యులుగారు ఉయ్యూరు వాసియైన శ్రీ గబ్బిట దుర్గాప్రసాద్ గారి ద్వారా పరిచితులు. నిజానికి సాహిత్యోపాసకుల పరిచయాలు స్వయం కారకాలు కావటంలోను వింత లేదు. ఉయ్యూరులో ఈ మధ్య సరసభారతి వారు నిర్వహించిన గీర్వాణకవుల కవితా గోష్ఠిలో శ్రీ రామలక్ష్మణాచార్యుల వాణిని, బాణిని విని ఆనందించిన వారిలో నేనొకడను.

శ్రీ లక్ష్మణాచార్యులవారు సువర్చలాంజనేయ శతకం వ్రాయటం కూడ యాదృచ్ఛికమే. అది శ్రీ గబ్బిట దుర్గాప్రసాద్ గారి ప్రోత్సాహము, ప్రోద్భలము వల్ల వ్రాయబడింది. అది యాదృచ్ఛికం అనటం కంటె దైవేచ్ఛఅనుకొనటం సమంజసం. ఎందుకంటే వీరు రామలక్ష్మణులైనప్పుడు హనుమంతుని బంధం, అనుబంధం అసామాన్యమైనది గదా.

ఈ శతకం నాకు అందించి, కొన్ని పద్యాలు చదివి వినిపించి నాలుగు మాటలు వ్రాయవలసిందిగా కోరినారు ఆచార్యులవారు. నాకు భగవత్సంబంధమైన శతక విషయంలో వ్యతిరేకత మంచిది కాదనిపించింది. అంతేకాదు పద్యాలు చూతును గదా అద్భుతంగా ఉన్నాయి. రసవత్తరంగా ఉన్నాయి. మృదు పద భూయిష్టంగా ఉన్నాయి. భక్తి, యుక్తి రచనలో మేళవింపబడి ఉన్నాయి. పద్యాలలోని నవరసాలు సైతం సునాయాసంగా చదువుకొనటానికి అనువుగా ఉన్నాయి. ఈ విషయం పాఠకులకు తెలియజెప్పేందుకే యీ నాలుగు మాటలు వ్రాస్తున్నాను.

ఇది ప్రథమ ప్రయత్నంగా చేసిన శతక రచన అని కవిగారు చెప్పారు. నాకలా అనిపించలేదు. వ్యక్తి సంస్కారం, దైవభక్తి, సహృదయుల ప్రోత్సాహం, యీ మూడు కలిసివచ్చి అంతరాంతరాల్లో పొదిగొన్న కవితాశక్తి ఆవిష్కరింపబడుతుంది. అదే యిక్కడ జరిగింది.

అయితే కవిగారు తనకు తానుగా నిర్ణయించుకొన్న మకుటం మాత్రం ఆశ్చర్యకరమైనది. "సువర్చలా హృదయ వల్లభ సుందర వాయునందనా!" అని. ఒక విధంగా చూస్తే ఇది తనకు తాను విధించుకొన్న శిక్షవంటిది. అదేమిటో కవి పండితులకే ఎరుక. నాలుగవ పాదం తొలి అక్షరం యతి స్థానంలో నిర్ణీతమైయున్న అక్షరానికి సరిపడేట్లుండాలి. ప్రాసలో ఉండే మొదటి రెండు మూడు అక్షరాలు– మకుటంతో

కలిపితే పద్యంలోని చివరి పాదమవుతుంది. పై మూడు పాదాలకు- ఈ చివరి మకుటానికి మధ్య అతికే టంకం వేయటం చాలా చాలా కష్టం. ఆ కష్టాన్ని ఇష్టంగా భరించి వాయునందనుణ్ణి దరిజేర్చు కొన్నారు రామలక్ష్మణులు.

శ్రీ రామలక్ష్మణాచార్యుల వారి కృషి సఫలీకృతమైనందుకు అభినందిస్తున్నాను. కేవలం పూర్వగాథను, ఐతిహ్యాన్ని వినియోగించుకొంటూ వ్రాయటమే కాక, ఆ విశేషాలను భావనాత్మకంగాను, కల్పనానల్ప శిల్పాన్ని కూడా ప్రదర్శిస్తూ కవితామయం చేయటం ముదాహం. వీరి రచనలోని స్వారస్యాన్ని ఆస్వాదించి వాయునందనుని అనుగ్రహాన్ని పొందవలసిందిగా పాఠకలోకాన్ని కోరుకొంటూ, ముచ్చటగా మచ్చుకు మూడుపద్యాలను- వైవిధ్యంగల అంశాలకు సంబంధించినవి ఇక్కడ ఉదాహరిస్తూ ముగిస్తాను.

**1. పంచభూతాత్మకుడు హనుమంతుడు**

**వాయువు వల్లబుట్టి, తనివారగ నాకస వీధి బ్రా కియున్,**
**తోయపు మూలమౌ జలధి దూరమపారము దాటి, లంకలో**
**నాయమ భూజ జూచి, తుదనగ్నికి లంకను నాహుతిచ్చితీ**
**వాయె! సువర్చలా హృదయ వల్లభ సుందర వాయునందనా! 43**

**2. సంక్షిప్త సుందరకాండ**

**ఉప్పు సముద్రము న్నొకట నుప్పర వీధికి బ్రాకి దాటుటల్**
**చప్పున సీత జాడగని, చయ్యన ముద్రిక నిచ్చి, రత్నమున్**
**అప్పన గాగ గైకొనియు, నవ్వన భూమిని చెట్లు కూల్చియున్**
**గుప్పగ నింద్రజిత్తు, తనకోర్వని బ్రహ్మకు లొంగి యుండుటల్**
**తప్పక రావణుందరికి తార్చగ, లంకను గాల్చి వచ్చు నీ**
**గొప్పకు వందనంబు లివి, గొల్తు సమీర కుమార! మాకు నీ**
**వప్పు! సువర్చలా హృదయ వల్లభ సుందర వాయునందనా! 35**

**రచయిత యొక్క శరణాతి గతి**

**3. రాయిడిపెట్టు భావ భవ రాగపు రోగని పీడితుండనే**
**వాయు కుమార! వాలమున పాపవిమోచితు చేయగా ననున్**
**దాయగ రమ్ము స్వామి! కదు దస్సితి! నీ దయరోగ దుఃఖముల్**
**వాయ! సువర్చలా హృదయ వల్లభ సుందర వాయునందనా! 72**

విజయవాడ **- పువ్వాడ తిక్కన సోమయాజి**
ది 10-01-2017 9885628572



**G. DURGA PRASAD**
M.A; B.Sc; B.Ed.,
Head Master
Z P High School
ADDADA-521 309, Krishna Dt.

Resi :
Sivalayam Srreet,
VUYYURU-521 165.
Phone : 32797 STD Code : 08676 3

Date 17-11-96

శ్రీ లంకా బసవాచారి స్మారక
భవానీ మృత్యుంజయ విశిష్ట సాహితీ పురస్కారం
శ్రీ తుమ్మోజు రామలక్ష్మణాచార్యులు కు అభినందన
చందనం.

"యం సంతి గుణాః పుంసాం - వికసంత్యేవ తే స్వయం
నహి కస్తూరికామోదః - శపథేన నివార్యతే".

మనిషిలోని గుణాలు, యోగ్యతలు వాటంతటవే బయటపడి ఆకట్టుకుంటాయి. పరిమళ కస్తూరిని గాలించనంతమాత్రంతో దాని గుమగుమలు వ్యాపించి, పరిమళ భరితం చేయకుండా వుంటుందా?

అనంతమైన కాలానికీ, సకల విద్యలకు, బుద్ధికి ఆదిశేషుడు ప్రతీక. ఆయనే లక్ష్మణుడై, రామానుజుడైనాడు. ఆ రామలక్ష్మణులు ఒకరిలోనే వుంటే, ఒకరే ఐతే విశిష్ట వ్యక్తిత్వం రూపు దాలుస్తుంది. ఆ విశిష్ట వ్యక్తే శ్రీ తుమ్మోజు రామలక్ష్మణాచార్యులు. ఆచార్యత్వం ఆ విశిష్టతకు శిరోభూషణమైంది. ఈ సాహితీ మండలికి ఆయన విశిష్టమైన శ్రోతగా, వక్తగా, కవిగా, పండితునిగా, సద్విమర్శకునిగా, తనవంతు కర్తవ్యాన్ని ఆదినుంచీ వహిస్తూ, దీనికి సార్థకతను ఆపాదించారు. ఎందరున్నా, ఆచార్యులు లేకపోతే ఆయన లేని సాహితీ సభ వెలవెలబోవలసిందే. ఇన్ని విశిష్ట గుణాలున్నా, వినయంతో, తలవంచుకునే [illegible] మనిషి.

ఆంధ్ర సారస్వతాన్ని చుళుకీకృతం చేసి, సంస్కృతామృతాన్ని తనివార గ్రోలిన విద్వద్వరేణ్యులు శ్రీ లక్ష్మణాచార్యులు. ఆధునిక భావనను అవలంబనగా నిలిచే సౌజన్యమూర్తి. ప్రబంధ కవుల కవితామార్గాన్ని అలవోకగా, తన కమ్మని కంఠంలో వినిపించగలనేర్పున్న వారు. అందునా 'వసుచరిత్ర' లోని కవిత్వాన్ని, సంగీతపు బంగారాన్ని [illegible] మెరుగులు పెట్టగలిగిన దిట్ట. అందుకే మా "ఉర్వీరాపురీ విజయం" లా ఆయన మా అభినవ రామరాజభూషణ బిరుదుకవి.



# కవి మనవి

- తుమ్మోజు రామలక్ష్మణాచార్యులు
ఫ్లాట్ నెం.501, వినాయక రెసిడెన్సీ,
పద్మావతీ గార్డెన్స్, ఫేజ్-2, పోరంకి,
విజయవాడ- 521 137.
సెల్.నెం.9703776650

**పాహి సువర్చలా హృదయ వల్లభ సుందర వాయునందనా!**

మొదటగా "సువర్చలా సుందర వాయునందన" శతకాన్ని చదువుతున్న అందరికీ 'నమస్సుమార్పణమ్' చేస్తున్నాను.

ఒక పెద్ద పని పూర్తి కావటానికి నలుగురు భాగస్వాములౌతారు. నేను ఈ శతకం వ్రాయటమన్నది నాకు ఒక మహాకార్యమే. ఇదే నా మొదటి 'పుస్తక రచన' కాబట్టి. ఈ రచన పూర్తి కావటానికి కర్తను నేనయినా కారయిత, ప్రేరకుడు, అనుమోదకుడు అన్నీ శ్రీ గబ్బిట దుర్గాప్రసాద్ గారే.

శ్రీ దుర్గాప్రసాద్ గారితో నాకున్న అనుబంధం మూడు దశాబ్దాల క్రిందటిది. ఉయ్యూరులో 'సాహితీమండలి' సంస్థ స్థాపన నుండి వారి స్వసంస్థ 'సరసభారతి' కార్యక్రమాల దాకా కొనసాగుతూనే ఉన్నది. అలా కొనసాగుతూనే ఉన్నదనటానికి ఈ శతకమే తిరుగులేని సాక్షి.

నేను వృత్తిరీత్యా "తెలుగు పండిత" ఉపాధ్యాయుడిని కావటం 'సాహితీమండలి' వారి సాహిత్య కార్యక్రమాల్లో విశేషంగా పాల్గొనటం, కవిసమ్మేళనాలలో పద్యాలు వ్రాసి వినిపించటం, అప్పుడప్పుడు సాహిత్య ప్రసంగాలివ్వటం, గుడివాడలో భారతీ సమితి సభలు, అన్నింటికన్నా మించి శ్రీ దుర్గాప్రసాద్ గారు వివిధ అంశాలపై కవిసమ్మేళనాలను నిర్వహిస్తూ కవుల మేధస్సుకు పదను పెడుతూ ఉండటం వలన, పద్య రచనలో ఒకడుగు ముందుకు పడటం ఈ రచనకు దోహదం చేసాయి.

శ్రీ గబ్బిట దుర్గాప్రసాద్ గారిచే 'భవాని మృత్యుంజయ' విశిష్ట సాహితీ పురస్కారాన్ని నేను పొందే అదృష్టం కలగటం, ఒక కార్తీక పున్నమి వెన్నెలలో, శ్రీ దుర్గాప్రసాద్ గారింట అప్పటి సాహితీమండలి కార్యదర్శి పీసపాటి కోటేశ్వరరావుగారు, నేను, ప్రసాద్

గారు ముగ్గురం దుర్గాప్రసాద్‌గారి ధర్మపత్ని శ్రీమతి ప్రభావతిగారి ఆప్యాయత ఆదరాలు వడ్డనలను ఆస్వాదిస్తూ సాహిత్యపరమైన ముచ్చట్లతో గడిపిన ఆ మధుర స్మృతుల సంస్మరణ ఇప్పుడు కాక మరెప్పుడు!

గుడివాడలో శ్రీ మాటూరి రంగనాథ్ (అమ్మా ఛారిటబుల్ ట్రస్ట్) వారిచే సత్కారాన్ని పొందటం కూడా సాహిత్యరంగంలో పురోగమనానికి దోహదమైనది.

ఇక ప్రస్తుతానికి కొస్తే... ఒకరోజు అనగా 5-11-2016న మధ్యాహ్నం భోజనానికి సిద్ధమౌతుండగా శ్రీ దుర్గాప్రసాద్ గారి నుండి దూరవాణి వినిపించింది. కుశల ప్రశ్నల అనంతరం మా స్వామి సువర్చలాంజనేయ స్వామి... విషయ ప్రధానంగా శతకం వ్రాయగలరా? అన్నారు. ప్రయత్నించి గలనో... లేనో.. చెబుతానన్నాను. వృత్తాలు బాగుంటాయనిన్నీ మంచి మకుటం నిర్ణయించమనిన్నీ చెప్పారు. అదేమీ చిత్రమో కొద్ది నిమిషాల తరువాత స్ఫురించిన "పాహి సువర్చలా హృదయ వల్లభ సుందర వాయునందనా!" మకుటాన్ని వినిపించాను. బాగుందన్నారు. మొదటి రెండక్షరాలను తగ్గించి మిగిలినది మకుటంగా పెట్టి వ్రాయటం మొదలుపెట్టాను... అలా వారి సంకల్పాన్ని నా మనస్సులో పాదుకొల్పి... మధ్య మధ్య అభినందనలతో ప్రోత్సహిస్తూ శతకాన్ని పూర్తి చేయించిందీ, దీనికి అందమైన రూపాన్నిచ్చి మీ చేతుల్లో ఉంచిందీ, ఈ పుస్తకాన్ని వ్రాయించి నాకొక గుర్తింపు తెచ్చిందీ, ఇలా నన్ను ధన్యుడని చేసిందీ శ్రీ దుర్గాప్రసాద్ గారే. ఈశ్వరేచ్ఛ వారి ద్వారా నన్నునుగ్రహించింది. ఈవిధంగా నన్ను పూర్తికాలపు రచనా వ్యాసంగంపై మళ్ళించిన దుర్గాప్రసాద్ గార్కి కృతజ్ఞతా పూర్వక అభివాదములెన్ని చెప్పినా తక్కువే!!

మా పెద తాతగారు తుమ్మోజు పురుషోత్తమాచార్యస్వామి, యోగి, తత్త్వవేత్త, కవి, వాగ్గేయకారుడు, నటకుడు. అనేక కీర్తనలను వ్రాసారు. "హనుమద్విజయము" యక్షగానం వ్రాసారు. ఆయన 1934లో జీవ సమాధి అయ్యారు. చాలా కాలం వరకు ఆరాధనోత్సవాలు జరిగాయి.

మా నాన్నగారు శ్రీ చంద్రశేఖర భుజంగాచార్యులు 'ఆయుర్వేద వైద్యవిద్వాన్' ఆనువంశికంగా వచ్చిన వైద్య వృత్తి వారిది. సంగీత, సాహిత్య ప్రియులు, ఆధ్యాత్మిక చింతనాపరులు. 'హరి కథా గాన' ప్రవేశం, నాటక రంగ ప్రవేశం చేసారు. ఆయన నేను 5వ తరగతిలో ఉండగానే 'ఆంధ్ర నామ సంగ్రహం' పఠనం ప్రారంభింప చేసారు. నేను 7వ తరగతిలో ఉండగా 1964లో అకాల మరణం చెందటం నా దురదృష్టం.

మా పెద్దన్నయ్య కీ.శే. పురుషోత్తమచార్యులు ఇ.ఓ. గ్రామ పంచాయితీ. నన్ను

భాషాప్రవీణ చదివించారు. జంధ్యాల వారి కుంతీ కుమారి, పుష్ప విలాప పద్యాలను, సమయానుగుణంగా నీతి పద్యాలను, శ్లోకాలను చదువుతూ నాకు తెలుగు సాహిత్యాభిమానాన్ని పాఠశాల స్థాయిలోనే కలిగించారు. సరస వినోదినిని నాకు పరిచయం చేసారు. అనిర్వచనీయమైన తరాంతర వాహిని అయిన శక్తి శ్రీదుర్గాప్రసాద్ గారిచే ప్రేరణ పొందినదన్నది నా ప్రగాఢ విశ్వాసం.

ఈ శతక రచనలో ...... నేను "సువర్చలా హృదయ వల్లభ సుందర వాయునందనా" మకుటాన్ని ఎన్నుకొని, దానిని మార్చటానికి మనస్సు అంగీకరించక నన్ను నేను చట్రంలో బంధించు కోవటమైనది. నాలుగవ పాదం మొదట 2 లేదా3 అక్షరాలను మెప్పించే ప్రయోగం కంటే చొప్పించినవే... అందువల్లనే ఉద్దండ కవి పండితులు అంగీకరించని అఖండ యతులను కూడ అక్కడక్కడ ప్రయోగించక తప్పలేదు. భావ పరిపూర్తికై పద్యాలను మరికొన్ని పంక్తులకు పొడిగించక తప్పింది కాదు. రసాస్వాదనలో కవి పండితుల కివి పంటిక్రింద రాళ్ళే... మన్నింతురుగాక! పద్యాలలో కనిపించే సుగుణాలు నవవ్యాకరణ పండితుడు 'ఆంజనేయస్వామి' కనికరం. తద్భిన్నాలు గడిదేఅని నా పాండిత్యానికి నికషలు.

ఈనా శతకాన్ని సాకల్యంగా పరిశీలించి, తగిన సూచనలు, సలహాలనిచ్చి, మృదు మధుర దరహాస వచనాలతో నన్నభినందించి, ఆశీర్వదించి అమూల్యమైన అభిప్రాయాన్ని వ్రాసి యిచ్చిన బహుకావ్యకర్త శ్రీ పువ్వాడ తిక్కన సోమయాజి గార్కి, కావ్య పాఠకురాలు, సాహిత్యాభిమాని వారి శ్రీమతి ఇందిరాదేవి గార్కి ఇవే నా హృదయపూర్వక నమస్సు మాంజలులు.

అపుడపుడు నా పద్యాలను చూచి సూచనలతో ప్రోత్సహించిన తెలుగు పండితులు, కవి, మిత్రులు శ్రీ కాశిరాజు లక్ష్మీనారాయణగార్కి, శ్రీ పీసపాటి కోటేశ్వరరావు గారికి, శ్రీ వంగిపురపు వీరరాఘవాచారిగారికి, శ్రీ కట్టుకోలు సుబ్బారెడ్డిగార్కి, నా స్వరంతో రికార్డు చేసిన పద్యాలను 'వాట్సాప్' ద్వారా షార్జాలో ఉన్న మా తమ్ముడు చి॥ వెంకట నాగార్జునాచార్యులు, శుభప్రద దంపతులు విని అక్కడి "రసమయి" తెలుగు సంఘ మిత్రులకు పంపి ప్రచారం చేసారు. వారికి నా ధన్యవాదాలు. అలాగే అన్ని విధాలా సహకరించిన నా శ్రీమతి కనక సుమనకు కూడ....

నమస్సులతో... బుధజన విధేయుడు...

**- తుమ్మోజు రామలక్ష్మణాచార్యులు**

సెల్ నెం.9703776650

# స్మృత్యంజలి

- తుమ్మోజు రామలక్ష్మణాచార్యులు



పెదతాతగారు తుమ్మోజు పురుషోత్తమా చార్య స్వామి. యోగి, తాత్వికుదు, కవి, నటకుదు, వాగ్గేయకారుదు 1934లో జీవసమాధిలో ప్రవేశించారు.



మా తండ్రిగారు కీ॥ శే॥ తుమ్మోజు చంద్రశేఖర భుజంగాచార్యులు "ఆయుర్వేద వైద్య విద్వాన్", సంగీత, సాహిత్యాభిమాని, తాత్త్వికుదు, 1964లో స్వర్గస్థులైనారు.



మా పెద్దన్నయ్యగారు కీ॥ శే॥ పురుషోత్తమాచార్యులు కార్యానిర్వహణాధికారి, గ్రామపంచాయితీ, నన్ను భాషా ప్రవీణ చదివించిన పోషకులు. మంచి సాహిత్యాభిమాని.

జననం: 15-08-1938

మరణం: 08-12-2013

## 'శ్రీ సువర్చలా సుందర వాయునందన శతకము' ప్రచురణకు విరాళాలు అందజేసిన వదాన్యులకు **కృతజ్ఞతలు**

| | | | |
|---|---|---|---|
| 1. | శ్రీ గబ్బిట దుర్గాప్రసాద్, ప్రభావతి | – గౌతమస | రూ. 5,000 |
| 2. | గబ్బిట మృత్యుంజయ శాస్త్రి, సమత | – గౌతమస | 100 |
| 3. | గబ్బిట లక్ష్మీ నరసింహశర్మ, ఇందిర | – గౌతమస | 100 |
| 4. | గబ్బిట నాగ గోపాలకృష్ణమూర్తి, రాణి | – గౌతమస | 3,116 |
| 5. | గబ్బిట వెంకట రమణ, మహేశ్వరి | – గౌతమస | 100 |
| 6. | కోమలి సాంబావధాని, విజయలక్ష్మి | – విష్ణు వర్ధనస | 5,000 |
| 7. | వేలూరి వివేకానంద్, దుర్గ | – కౌండిన్యస | 100 |
| 8. | వేలూరి అశోక్, సంధ్యారాణి | – కౌండిన్యస | 100 |
| 9. | వేలూరి మృత్యుంజయ శాస్త్రి, విజయలక్ష్మి | – కౌండిన్యస | 100 |
| 10. | గణపవరపు రామకృష్ణ, పద్మ | – భారద్వాజస | 100 |
| 11. | గబ్బిట కృష్ణమోహన్, సునీత | – గౌతమస | 100 |
| 12. | గబ్బిట రామనాధబాబు, జయలక్ష్మి | – గౌతమస | 1,116 |
| 13. | గబ్బిట వెంకట లక్ష్మీ కళ్యాణ్ | – గౌతమస | 100 |
| 14. | గాదేపల్లి శ్రీనివాస్ | – భారద్వాజస | 100 |
| 15. | గుండు అంతర్వేది | – కామకాయనస | 100 |
| 16. | చంద్రశేఖర్, కళ | – గార్గేయస | 500 |
| 17. | తూటుపల్లి వెంకట సత్యబ్రహ్మానంద శాస్త్రి, రుక్మిణి | –కౌశికస | 1,000 |
| 18. | గాదేపల్లి హర్ష, హిమస్పందన | – భారద్వాజస | 116 |
| 19. | శంభుని శ్రీరామచంద్రమూర్తి, మహాలక్ష్మి | – భారద్వాజస | 100 |
| 20. | చతుర్వేదుల జానకి | – కాశ్యపస | 500 |
| 21. | వేలూరి రామకృష్ణ, వేదవల్లి | – కౌండిన్యస | 1,500 |
| 22. | వేలూరి రవికిరణ్, గాయత్రి | – కౌండి న్యస | 251 |
| 23. | వేలూరి హరికిషన్, సారిక | – కౌండిన్యస | 251 |
| 24. | కోట చంద్రశేఖర శాస్త్రి, ఉమాదేవి | – కౌండిన్యస | 2,500 |
| 25. | కోట సీతారామాంజనేయులు వెంకట లక్ష్మీకాంతం | – కౌండిన్యస | 2,500 |
| 26. | రాచకొండ నరసింహమూర్తి, అన్నపూర్ణాదేవి | –గార్గేయస | 2,500 |
| 27. | మైనేని గోపాలకృష్ణ, సత్యవతి | –శ్రీ వత్సస | 1,116 |
| 28. | ఏ సి పి శాస్త్రి, లక్ష్మీ కల్యాణి | –కౌశికస | 500 |
| 29. | పొన్నాడ సత్య ప్రకాష్ | –హరితస | 100 |
| 30. | ఏ .ప్రకాష్ రెడ్డి, | –కౌండిన్యస | 100 |

| | | | |
|---|---|---|---|
| 31. | గొట్టుముక్కల మారుతీ దేవి, | –భారద్వాజస | 100 |
| 32. | దుర్భాకుల వెంకట సుబ్రహ్మణ్యం, లక్ష్మీ కల్యాణి | –హరితస | 100 |
| 33. | గబ్బిట ఆంజనేయ శాస్త్రి, పద్మావతి | –గౌతమస | 100 |
| 34. | గబ్బిట సీతారామ శర్మ, శ్రీ గిరి | –గౌతమస | 100 |
| 35. | గబ్బిట జయమాణిక్య శాస్త్రి, గాయత్రీ మణిమాల | –గౌతమస | 100 |
| 36. | గబ్బిట శ్రీనివాస శాస్త్రి, శ్రీ కళ | –గౌతమస | 100 |
| 37. | గబ్బిట కాశీ విశ్వనాద్, గీత | –గౌతమస | 100 |
| 38. | గబ్బిట కృష్ణస్వామి, వెంకట సుబ్బలక్ష్మి | –గౌతమస | 100 |
| 39. | తూములూరు శ్రీ దక్షిణామూర్తి శాస్త్రి, నాగ పద్మావతి | –హరితస | 100 |
| 40. | రావి శరత్, ఉష | –చెరుకు నూళ్ల | 100 |
| 41. | గారపాటి ప్రసాదావధాని,అనసూయ | –భారద్వాజస | 100 |
| 42. | తుమ్మల చలమయ్య | –కౌండిన్యస | 100 |
| 43. | వేదాంతం కృష్ణమూర్తి, సువర్చల, | –గౌతమస | 100 |
| 44. | వారణాసిసుబ్బయ్య, లలితాంబ | –కాశ్యపస | 100 |
| 45. | కొల్లి భారతీదేవి | –కౌండిన్యస | 100 |
| 46. | గురజాడ వెంకటేశ్వరరావు,సీతాసత్యప్రసూనాంబ | –కౌండిన్యస | 100 |
| 47. | వీణెం గోపాలకృష్ణయ్య,లక్ష్మీ ప్రసన్న | –ఆత్రేయస | 100 |
| 48. | కె.వి ఎల్ .యెన్ .ప్రసాద రావు, భారతి | – కామకాయనస | 100 |
| 49. | దుగ్గిరాల రమాదేవి | –పరాశర | 100 |
| 50. | వెంపటి కృష్ణ యాజీ,అన్నపూర్ణ | –హరితస | 100 |
| 51. | కొమరవోలు శివ ప్రసాద్ , హైమవతి | –భారద్వాజస | 100 |
| 52. | లాడ్ సుధీంద్ర, మాధవి | –భారద్వాజస | 1,116 |
| 53. | చలపాక ప్రకాష్, కృష్ణప్రియ | – సంవర్త బ్రహ్మఋషి | 100 |
| 54. | గొన్నాబత్తుల మధు నాగ సందీప్, శిరీష | – మణిభద్రబ్రహ్మర్షి | 100 |
| 55. | గోవిందరాజు శ్రీనివాస్, కనకదుర్గ, వేణుమాధవరావు,భవాని | –భారద్వాజస, | 2000 |
| 56. | సింగరాజు గోవర్ధన్, కల్యాణి | –కౌండిన్యస | 100 |
| 57. | కాళీపట్నపు భీమశంకరరావు, ఉమ | –కౌండి న్యస | 100 |
| 58. | బాగవతుల గోపాలరావు | –కౌండిన్యస | 100 |
| 59. | సుంకర కోటేశ్వరరావు, సరోజినీ | – మారుట్ల | 100 |
| 60. | పెళ్ళూరి వెంకట చలపతి, శేషుకుమారి | –కౌండిన్యస | 100 |
| 61. | తుమ్మోజు రామలక్ష్మణాచార్యులు,కనక సుమన | –కాశ్యపస | 100 |
| 62. | ముదిగొండ సీతారావమ్మ | – భారద్వాజస | 100 |
| 63. | మంకు శ్రీను, వెంకట రమణ, | –కౌండిన్యస | 100 |
| 64. | వట్టెం రామ కృష్ణ, శాంతిశ్రీ | –కౌండిన్యస | 100 |

| | | | |
|---|---|---|---|
| 65. | వేదాంతం మురళీ కృష్ణ | –ఆత్రేయస | 100 |
| 66. | కీ.శే. నేరెళ్ళ వెంకటేశ్వరరావు, సత్యవతి–చిత్రుపుల గోత్రం – జ్ఞాపకార్థం శ్రీ గుప్త – అంటి అంకుల్ క్లాత్ స్టోర్స్ | | 2,000 |
| 67. | శ్రీ టి.శివరామకృష్ణ, ప్రమీల | –పమిడి పళ్ళ | 1,116 |
| 68. | కె.బాబూరావు | –భారద్వాజస | 500 |
| 69. | ఎం.వి.రామచంద్రరావు | –కాశీ | 100 |
| 70. | జే.వై.హరిప్రసాద్ | –కౌండిన్యస | 100 |
| 71. | ఆర్ శ్రీనివాస్ | –బలభద్ర | 100 |
| 72. | బి.సత్యనారాయణ | –మారుట్ల | 100 |
| 73. | కె.సుబ్బారావు | –వల్లుట్ల | 100 |
| 74. | వై.వెంకటేశ్వరరావు | –వల్లుట్ల | 100 |
| 75. | ఎం అర్జున రావు | –జలనెల | 100 |
| 76. | ఏ.వెంకట రఘుకుమార్ | –చిరిసి నోళ్ళ | 100 |
| 77. | జి.నాగేంద్రరావు | –చెట్టళ్ళ | 100 |
| 78. | షేక్ సిలార్ | –కౌండిన్య | 100 |
| 79. | కె.వెంకట అప్పలాచార్యులు | –శ్రీవత్స | 100 |
| 80. | ఎం.ఏడుకొండలు | –పైడి పళ్ళ | 100 |
| 81. | జి.శివ రామకృష్ణ ప్రసాద్ | –దర్పణాల | 100 |
| 82. | సి.హెచ్.సత్యనారాయణరెడ్డి | –పైడి పళ్ళ | 100 |
| 83. | ఏ.కృష్ణ కిషోర్ | –ఆరుట్ల | 100 |
| 84. | ఎం.పవన్ కుమార్ | –తంగెళ్ల | 100 |
| 85. | కె.శ్రీ రామచంద్రమూర్తి | –శ్రీ వత్స | 100 |
| 86. | డి.అహల్య | –శ్రీవత్స | 100 |
| 87. | హిమాద్ర రేవతి | –గార్గేయస | 100 |
| 88. | వై.శ్రీనివాసశర్మ | –కాసికళ | 100 |
| 89. | కె.వెంకట మస్తాన్‌రావు | –రెటిళ్ళ | 100 |
| 90. | కె.సుభాస్ చంద్రబోస్ | –ధాన్యాల | 101 |
| 91. | వి.ఎస్.వి.స్వామి విజయలక్ష్మి | –భారద్వాజస | 100 |
| 92. | సి.హెచ్.వెంకటరావు, అన్నపూర్ణ | –ఆత్రేయస | 100 |
| 93. | సి.హెచ్.శ్రీనివాసరావు, జయలక్ష్మి | –కౌశికస | 100 |
| 94. | ఎం.సూర్యనారాయణ, కృష్ణవేణి | –శ్రీవత్స | 100 |
| 95. | యెన్.వెంకట సుబ్బయ్య, నీరజ | –చెట్టేళ్ళ | 100 |
| 96. | యెన్.పూర్ణచంద్రరావు, రాజేశ్వరి | –జనకుల | 100 |
| 97. | యెన్.వెంకటేశ్వరరావు | –జటంకుల | 100 |
| 98. | ఏ.ఎస్.వి.ప్రసాద్ | –కుత్సస | 100 |

| | | |
|---|---|---|
| 99. పి.కోటేశ్వరరావు | –రేచర్ల | 100 |
| 100. బి.చంద్రశేఖర్ | –పద్మిసెట్ల | 100 |
| 101. ఎం.డి.దావూద్ | –కౌండిన్య | 100 |
| 102. ఏ.ఈశ్వరరావు | –నాగుల | 100 |
| 103. టి.నవ్యశ్రీ | –కమండల | 100 |
| 104. కె.సోమశేఖర్ | –నాగుల | 100 |
| 105. పి.జయలక్ష్మి | –నాగుల | 100 |
| 106. జి అప్పల నరసయ్య | –నాగుల | 100 |
| 107. సి.హెచ్ గణేష్ కుమార్ | –నాగుల | 100 |
| 108. పి.నాగలక్ష్మి | –నాగుల | 100 |
| 109. బి.లావణ్య | –నాగుల | 100 |
| 110. కె.హేమలత | –నాగుల | 100 |
| 111. ఎం.కృష్ణసాయి | –నాగుల | 100 |
| 112. వి.త్రినాద్ | –నాగుల | 100 |
| 113. ఎం.సాయి సందీప్ | –పైడి పళ్ళ | 100 |
| 114. పి.అరుణ | –నాగుల | 100 |
| 115. ఝాన్సీలక్ష్మి | –నాగుల | 100 |
| 116. వి.భార్గవి | –నాగుల | 100 |
| 117. కె భవాని | –కౌండిన్య | 100 |
| 118. ఆర్.నాగ నవ్యశ్రీ | –భార్గవస | 100 |
| 119. శ్రీ పి.వెంకట సుబ్రహ్మణ్యం, లక్ష్మీకల్యాణి | –నారతస | 1,116 |
| 120. శివ కోటేశ్వరరావు, లక్ష్మి | – కౌండిన్యస | 100 |
| 121. తిరుపతిరావు, నాగమణి | –నాగుల | 100 |
| 122. పి నందివర్ధనరావు, గుంటమ్మ | –గరిగి నోళ్ళ | 100 |
| 123. తవటినాయుడు, రాములమ్మ | –నాగుల | 100 |
| 124. నారీషు, జాహ్నవి | –వీరకుల | 100 |
| 125. గోపాలకృష్ణ, సస్యశ్రీ | –పమిడిపళ్ళ | 100 |
| 126. సింహాచలం, లక్ష్మి | –నాగుల | 100 |
| 127. చెన్నారావు, మంగ | –చిట్టిపళ్ళ | 100 |
| 128. ఆర్.వి.శివ కోటేశ్వరరావు, భారతి | –సానకుల | 100 |
| 129. పోతురాజు, శివరేవతి | –పమిడిపళ్ళ | 100 |
| 130. గోపీకృష్ణ, నాగలక్ష్మి | –కౌండిన్య | 100 |
| 131. రమేష్, నాగేశ్వరమ్మ | –తంగెళ్ల | 100 |
| 132. వేణు నాధశర్మ | –శతమర్షణ | 100 |
| 133. హరీష్‌శర్మ, సుశీల మనోజ్ఞ | –శతమర్షణ | 100 |

| | | |
|---|---|---|
| 134. రామ శేషారావు, కాశీఅన్నపూర్ణ | -వినుకుల | 100 |
| 135.నాగరాజు, సావిత్రి | -నాగుల | 100 |
| 136.శ్రీనివాసరావు, అపర్ణాదేవి | -నారాయణ మహర్షి | 100 |
| 137. భవానీ శంకరరావు, పద్మశ్రీ | -బాలగిరి | 100 |
| 138. శ్రీనివాసరావు, లక్ష్మీసుందరి | -శ్రీపాల | 100 |
| 139. సీతారామ ప్రసాద్, కనకదుర్గ | -వల్లుట్ల | 100 |
| 140. చంద్ర శేఖరరావు, రాజేశ్వరి | -చెరుకు నూళ్ల | 100 |
| 141. సాయి వెంకట పవన కుమార్, పద్మిని | -వల్లుట్ల | 100 |
| 142. మాల్యాద్రి, సుబ్బరత్నమ్మ | -పోగునోళ్ళ | 100 |
| 143. మధుసూదనరావు, వెంకట కనకలక్ష్మి | -దేశెట్ల | 100 |
| 144. హనుమంతరెడ్డి, శోభ | -ముదిగొండ్ల | 100 |
| 145. వీరరాజు, వెంకటలక్ష్మి | -శిరిసెట్ల | 100 |
| 146. రాజేంద్రబాబు, సాయిలక్ష్మి | -చెన్నమళ్ళ | 100 |
| 147. లక్ష్మారెడ్డి, లక్ష్మీసునీల | -మారుట్ల | 100 |
| 148. హరిబాబు, స్వాతి | -చంద్రాల | 100 |
| 149.ఏ.నాగ వెంకట రాజారావు, సీత | -నాగుల | 100 |
| 150.పి.శ్రీనివాసరావు, సునీత | -నాగుల | 100 |
| 151.ఎస్.దాశరదిబాబు, పావని | -మధునాకుల | 100 |
| 152. సిహెచ్.కుటుంబరావు | -మణి వినుకుల | 100 |
| 153. ఎం.శివకుమార్, ఝాన్సిరాణి | -బలిసెట్ల | 100 |
| 154. ఎం.బాలాజీ, శ్రీలక్ష్మి | -బలిసెట్ల | 100 |
| 155. వంగవీటి శ్రీనివాస ప్రసాద్,శివకుమారి | -పమిడి పళ్ళ | 100 |
| 156. కృష్ణ కిషోర్, భాస్కర రజని | -పమిడి పళ్ళ | 100 |
| 157. వై.వెంకటేశ్వరరావు, సుశీల | -వల్లుట్ల | 100 |
| 158. పి.రామారావు, జయలక్ష్మి | -జనక నోళ్ళ | 100 |
| 159. పి.నరసింహారావు, శివపార్వతి | -జనక నోళ్ళ | 100 |
| 160. పి.నరసింహారావు, కరుణానిధి | -పద్మాక్షి | 100 |
| 161. జి.నాగేశ్వరరావు, సరస్వతి | -కూనాల | 100 |
| 162. జి.శ్రీనివాసరావు, మల్లీశ్వరి | -కూనాల | 100 |
| 163. ఏ.శోభనాద్రీశ్వరరావు సింధూజ | -కౌండిన్య | 100 |
| 164. వి.సింహాచలం, సన్యాసమ్మ | -నాగుల | 100 |
| 165. ఎస్.గురువులు, నారాయణ | -నాగుల | 100 |
| 166. రాజకుమార్, రాణీఅన్నపూర్ణ | -మేడిపళ్ళ | 100 |
| 167. పి.రామకృష్ణ, రమాదేవి | -నాగుల | 100 |
| 168. పి.శివశంకర్, వాణి | -నారాయణ మహర్షి | 100 |

| | | |
|---|---|---|
| 169. ఎస్.రమణ, లక్ష్మి | –పైడిపళ్ళ | 100 |
| 170. డి.వెంకటేశ్వరరావు, వెంకట లక్ష్మి | –నిమ్మపళ్ళ | 100 |
| 171. వీర కుమార్, సీతామహాలక్ష్మి | –కమండల | 200 |
| 172. కోట వెంకటేశ్వరశర్మ, అహల్య | –కౌండిన్య | 100 |
| 173. పి.కిషోర్ కుమార్, రాజీవి | –కౌండిన్య | 100 |
| 174. వి.విశ్వేశ్వరరావు, శారద | –భారద్వాజస | 100 |
| 175. జి.నాగేంద్రరావు, అనిత | –చెట్టేళ్ళ | 100 |
| 176. కె.వెంకటేశ్వరరావు, నాగ వెంకట శివలక్ష్మి | –పమిడిపళ్ళ | 100 |
| 177. జి.సాంబశివరావు, విజయకుమారి | –రేచెర్ల | 100 |
| 178. జి.హెచ్.సత్యనారాయణ రెడ్డి, ఝాన్సిరాణి | –పమిడిపళ్ళ | 100 |
| 179. కె.శేషగిరిరావు, కృష్ణకుమారి | –పమిడి పళ్ళ | 100 |
| 180. టి.శ్రీనివాసరావు, కృష్ణకుమారి | –పమిడి పళ్ళ | 100 |
| 181. వి.లక్ష్మణరావు, అనూరాధ | –జపనీళ్ళ | 100 |
| 182. వి.రాము, ప్రమీలారాణి | –కౌండిన్య | 100 |
| 183. జి.శంకర్, గౌరీ | –పమిడి పళ్ళ | 100 |
| 184. పి.వెంకట రాంబాబు, ఉమాదేవి | –పమిడి పళ్ళ | 100 |
| 185. కె.నాగరాజు, అశ్విని | –మానుట్ల | 100 |
| 186. జే.యలమందరావు, ఉదయలక్ష్మి | –ఇనకుల | 100 |
| 187. ఎస్.భాస్కరరావు, విజయభారతి | –శత మర్షణ | 100 |
| 188. రామకృష్ణ, పద్మావతి | –పమిడి పళ్ళ | 100 |
| 189. గోవర్ధనరావు, సామ్రాజ్యం | –సూరిళ్ళ | 100 |
| 190. బి.శివవెంకటకృష్ణ, లీలాకుమారి | –ఆత్రేయస | 100 |
| 191. యెన్.సుబ్బారాయుడు, కమల | –మార్కండేయ | 100 |
| 192. పి.ఈశ్వరరావు, సుజాత | –నారాయణ మహర్షి | 100 |
| 193. ఏ.చంద్రమోహన్, నాగమణి | –శిరిసెట్ల | 100 |
| 194. వి.శ్రీనివాసమూర్తి, సరస్వతి | –పరశురామ | 100 |
| 195. సూర్యనారాయణ, గౌరీ | –నాగళ్ల | 100 |
| 196. వి.బాలగంగాధరరావు, శోభ | –దాసనోళ్ళ | 100 |
| 197. పి.ఆంజనేయులు, పద్మావతి | –పమిడి పళ్ళ | 100 |
| 198. జే శ్రీమన్నారాయణ, అజిత కుమారి | –పెసనాళ్ళ | 100 |
| 199. నేతాజీ, జగదీశ్వరి శ్రీదేవి | –చెట్నోళ్ళ | 100 |
| 200. ఎం.శ్రీనివాసశర్మ, శివలక్ష్మి | –ఆత్రేయస | 100 |
| 201. ఐ.రామారావు, గంగాభవాని | –భారద్వాజస | 100 |
| 202. రామ కృష్ణప్రసాద్, సీతామహాలక్ష్మి | –కాశ్యపస | 100 |
| 203. కె.వెంకటేశ్వరరావు, కోటేశ్వరమ్మ | –వశిష్ట | 100 |

| | | |
|---|---|---|
| 204. నాగేంద్రరావు, ధనలక్ష్మి | –వల్లుట్ల | 100 |
| 205. రామలింగేశ్వరరావు, లక్ష్మి | –ఇనకుల | 100 |
| 206. పునీత్ | –నాబిళ్ళ | 100 |
| 207. హనుమాన్ సుబ్బారావు, శోభశ్రీ | –భారద్వాజస | 100 |
| 208. శివప్రసాద్, నాగమణి | –గంగోత్రి | 100 |
| 209. సాయిబాబు | –చంద్రాళ్ళ | 100 |
| 210. పి.విజయసారధి | –కౌండిన్య | 100 |
| 211. కె.రామమోహనరావు | –ముదు నోళ్ళ | 100 |
| 212. సంపూర్ణ చంద్రమౌళీశ్వరరావు | –కౌండిన్య | 100 |
| 213. దావులూరు రాధాకృష్ణమూర్తి | –ఆత్రేయస | 100 |
| 214. అర్.పి.జి.పి.ప్రసాద్ | –కౌండిన్యస | 100 |
| 215. పి.గంగాధరరావు | –కౌండిన్య | 100 |
| 216. సుబ్రహ్మణ్యం, రాజరాజేశ్వరి | –శత మర్షణ | 100 |
| 217. బసవయ్య, రంగమ్మ | –మునిబాల | 100 |
| 218. సాయికిరణ్, రవళి | –శ్రీవత్సస | 100 |
| 219. విశ్వనాథ మురారి, భార్గవి | –హరితస | 100 |
| 220. చిలుకూరి వెంకట లక్ష్మీనరసింహశర్మ,అమ్మాజీ | –హరితస | 100 |
| 221. గుండు శింగిరి శాస్త్రి, రామలక్ష్మి | –కామకాయనస | 100 |
| 222. మానాప్రగడ గౌతమేశ్వరరావు, జగదాంబ | –కౌండిన్యస | 100 |
| 223. ఆసపన్న ప్రసాద్, లలిత | –నాగ | 100 |
| 224. రాయప్రోలు చిదంబరం, గౌరీ జయలక్ష్మి | | 100 |
| 225. పసుమర్తి సాంబశివ సోమయాజులు | –కాశ్యపస | 100 |
| 226. జొన్నలగడ్డ మిదున్, అనూరాధ | –కౌండి న్యస | 100 |
| 227. జోశ్యుల నాగేశ్వరరావు, శ్యామలాదేవి | –కాశ్యపస | 1,000 |
| 228. గుంటక వేణు గోపాలరెడ్డి, పద్మావతి | –మూడు నూళ్ల | 100 |
| 229. ములగలేటి శివరామకృష్ణ దీక్షితులు, ఆదిలక్ష్మి | –కౌశికస | 2,650 |
| 230. కె.పవన్‌కుమార్, హరిత | –భారద్వాజస | 116 |
| 231. మంగళగిరి ఆదిత్య ప్రసాద్ | –కౌండి న్యస | 100 |
| 232. తుర్లపాటి రాజేశ్వరరావు, భాగ్యలక్ష్మి | –కణ్వస | 100 |
| 233. చౌడాడ అప్పలనాయుడు, లక్ష్మి | –నాగుల | 100 |
| 234. యల్లాప్రగడ సుబ్రహ్మణ్యం, జయలక్ష్మి | –భారద్వాజస | 2,001 |
| 235. ఎల్లెపు కళాసాగర్, లీలావతి | –పైడిపాల | 100 |
| 236. రాపాక సుబ్బలక్ష్మి | –భారద్వాజస | 100 |
| 237. గానుగాపాటి హనుమంతరావు, రాజ్యలక్ష్మి | –కౌండి న్యస | 100 |
| 238. రాపాక ఆరాధ్య | –భారద్వాజస | 100 |

| | | |
|---|---|---|
| 239. చల్లా వేంకట నరసింహమూర్తి, శైలజ | –కౌండి న్యస | 100 |
| 240. లంకా శుక సీతాపతి, అన్నపూర్ణ | –కౌండి న్యస | 100 |
| 241. వేకనూరు శ్రీనివాసరావు, అనూరాధ | –జలనిధి | 100 |
| 242. శోంఠి వీరకిరణ్ | –కౌండిన్యస | 100 |
| 243. ఇప్పిరిశెట్టి మాణిక్యాలరావు | –రేచర్ల | 100 |
| 244. బాసిన భానుమతి | –భృగుదేవ | 100 |
| 245. బోడి పాండురంగరాజు, సుజాత | –ఆత్రేయస | 100 |
| 246. శ్రీ సాయి ధనుష్ | –వృక్షి పళ్ళ | 100 |
| 247. జి.వెంకట సుబ్బారావు, లలిత | –గ్రంధశిల | 100 |
| 248. వీరాంజనేయులు, పద్మావతి | –మునికుల | 100 |
| 249. సత్యనారాయణ, నాగపద్మావతి | –జలనిధి | 100 |
| 250. సీతంరాజు మల్లిక – కుమారుదు మోహన మల్లికార్జునరావు | | |
| | –కాశ్యపస | 300 |
| 251. మల్లంపల్లి భానుప్రకాష్, కనక దుర్గ | –హరితస | 500 |
| 252. కె.ఏడుకొండలరావు, వెంకటేశ్వరమ్మ | –కౌండిన్యస | 100 |
| 253. బి.సుధాకరరావు, రాజ్యలక్ష్మి | –కౌండిన్యస | 100 |
| 254. ఎస్.వెంకటేశ్వరరావు, గాంధి | –వెలిదెళ్ళ | 100 |
| 255. రామకృష్ణ, సీతా వెంకటశేషసాయి | –శ్రీ వత్సస | 200 |
| 256. సి.హెచ్.సీతా రామాంజనేయులు, అన్నపూర్ణ | –ఆత్రేయస | 100 |
| 257. సుద్దపల్లి బలరామ కృష్ణ | –శత మర్షణ | 100 |
| 258. ఎస్.అప్పారావు నాగలక్ష్మి | –నెలబాల | 100 |
| 259. ఏ.శ్రీనివాసరావు, నాగలక్ష్మి | –తాటిపళ్ళ | 100 |
| 260. వి.వెంకట నవీన్, నాగప్రియ | –మౌద్గల్యస | 100 |
| 261. కె.రమాదేవి, రసజ్ఞ, హిమజ | –వేనోళ్ళ | 100 |
| 262. కె శ్రీనివాసరావు, దుర్గారాణి | –విప్పర్ల | 100 |
| 263. పి.ధరణి చరణ్, సాయిప్రియ | –కాగితాల | 100 |
| 264. శ్రీ హనుమాన్ భక్త | –హరితస | 500 |
| 265. తుమ్మిడి రామ్‌కుమార్, బాలనాగమణి | –పైడిపాల | 1,000 |
| 266. తుమ్మిడి విజయకుమార్, రామలక్ష్మి | –పైడిపాల | 1,000 |
| 267. తుమ్మిడి అరుణ్‌కుమార్, బాలసరస్వతి | –పైడిపాల | 1,000 |
| 268. తుమ్మిడి బుల్లి గోవిందరాజు, ప్రసన్న మహాలక్ష్మి | –పైడిపాల | 1,000 |
| 269. తుమ్మిడి శ్రీనివాస్, రమ్యరాణి | –పైడిపాల | 1,000 |
| 270. వాగిచర్ల శ్రీనివాసరావు, సుస్మితాకుమారి | –వినకాల | 2,000 |
| 271. వై.వి.బి.రాజేంద్రప్రసాద్, భ్రమరాంబ | –వల్లుట్ల | 100 |
| 272. ఆదిరాజు విజయ్, ఈశ్వరి | –హరితస | 200 |

## నాస్తి తేషాం యశః కాయే జరామరణజం భయమ్

ధీనుత గుండు వంశజుడు దీన జనోద్ధరణోత్సహుండు ల
క్ష్మీనరసింహ నామక సుశీలుడు యాజియు నుర్వరా పురిన్
కానగ నాంజనేయునకు కట్టెను నాలయ మియ్యడెన్న నిం
పౌను! సువర్చలా హృదయ వల్లభుడిచ్చుత ముక్తి సంపదల్

మందిర పాలనాక్రతువు మాన్యత మృత్యుజయాఖ్యుడైన శా
స్త్రిందని వొంద నొందెడు విశిష్టత నాగమ శాస్త్ర యు
క్తిందగ నర్చనాదికము దివ్యప్రబంధయుతంబు గాగ నిం
పంద సువర్చలాహృదయ వల్లభుడిచ్చెడు మోక్ష సంపదల్

మందిర పాలనా విధి కుమారుడు దుర్గప్రసాదు వర్యునిన్
పొందెను గబ్బిటాన్వయుడపూర్వ మహోన్నత సాధుశీలి యీ
మందిర వృద్ధికై శ్రమదమాదుల కోర్చె, ప్రభావతీ సతీ
సుందర దెందమున్నెలమి సుందర మారుతి సేవ జేయ నా
నందము తోడుతన్నడువ నంకిత సత్యపథానువర్తియై

ముందర ముందరన్నిచట పూజలు యజ్ఞము లాగమోక్తమై
క్రందుగ సాగిపోవుతను గౌతమ గోత్రపు గబ్బిటాన్వయం
బందు సువర్చలా హనుమ లాశిష వాక్కులు పర్వ నిత్యమై
సంధిలు గావుతన్ శుభము సంపద కీర్తియు మోక్షసంపదల్



# సువర్చలా సుందర వాయునందన శతకము

ఓం శ్రీరామచంద్ర పరబ్రహ్మణే నమః

## ప్రార్థన

శ్రీ జనకాత్మజా హృదయసీమ విహార మనోహరున్ మనో
రాజిత రామనామజపరాగ మరాళ విలాసు జేసి, వి
భ్రాజిత భక్తిసాంద్రమతివౌ నినుగొల్తు శివాంశ సంభవో
ద్భ్రాజ! సువర్చలా హృదయ వల్లభ సుందర వాయునందనా! 1

వివరణ: సీతాదేవి హృదయసీమలో విహరించే మనోహరుడైన రాముని, నిరంతర రామనామ జపంతో, రామస్వరూపుడైన పరమ హంసను నీ మనస్సులో నిలుపుకొన్నట్టి, ఈశ్వరాంశతో పుట్టినట్టి సువర్చలాదేవి హృదయేశ్వరుడవైన ఓ వాయునందనా నిన్ను సేవించెదను. (మరాళము=హంస, శివాంశ సంభవ+ ఉత్+భ్రాజ=శివుని యొక్క అంశంతో పుట్టిన గొప్ప తేజస్సు గలవాడా!)

## ఉయ్యూరులో స్వామి

శ్రీరమముర్వరా పురికి శ్రేయము గూర్చు సువర్చలాన్వితా!
మారుతి! పూర్ణ దృక్కులను మాన్యత కృష్ణకు శాఖయైన పు
ల్లేరను వాహినీదరిని లీలగ నిల్చినవాడ! రక్షనీ
వౌర! సువర్చలాహృదయ వల్లభ సుందర వాయునందనా! 2

సిరులకు ధామముర్వర విశిష్ట పురంబు, నరంటి తోటలన్
చెఱకు ను,నాగవల్లుల సుసేద్య విశేష పరీత భూములన్
సరస వినోద క్రీడల ప్రశాంత విహార మొనర్చి కావు మీ
వరయ! సువర్చలాహృదయ వల్లభ సుందర వాయునందనా! 3

## స్వామి జననం

పుట్టక పూర్వమే బడసి పుత్తడిజందెము, పైడిగోచియున్,
పట్టుదలన్ భళీ! పరగ బ్రహ్మను పొందియు విశ్వకర్మచే,
పుట్టుక బ్రహ్మచారియను పొందగు నామము పొందినావు నీ
వట్టుల కేసరీ సతికి వాయువునౌరసుడౌచు పుట్టితో
పట్టి సువర్చలాహృదయ వల్లభ సుందర వాయునందనా! 4

వివరణ: ఈశ్వర దత్తమైన వీర్యరూపమయిన తేజస్సును వాయువు తపస్సు చేస్తున్న కేసరీ పత్నియైన అంజని చేత పండుగా స్వీకరింపజేసాడు. ఫలితంగా ఆంజనేయుడు జన్మించాడు. ఆంజనేయుడు గర్భంలో ఉండగానే పట్టుదలతో విశ్వకర్మ అనుగ్రహించగా కుండలములను బ్రహ్మోప దేశమును పొందాడు. అనగా చౌలము, ఉపనయనము గర్భమునందే జరిగాయి. అందుచేతనే హనుమ ఆజన్మబ్రహ్మచారి యయ్యాడు.

## శైశవక్రీడ

ఊహలవెంత తీపియొ నవోదయ భానుని సత్ఫలంబుగా

**నాహరణంబు సేయగ మహౌజస తేజము తోడుతన్ మహా**
**సాహసక్రీడ జూపితివి శైశవమందున నింగికేగియున్**
**పాహి! సువర్చలాహృదయ వల్లభ సుందర వాయునందనా! 5**

వివరణ: బాల హనుమంతుడు ఉదయిస్తున్న సూర్యబింబాన్ని పండుగా భావించి, ఆకాశానికి ఎగిరాడు. శైశవ క్రీడ చూపిన సువర్చలానాధుడైన ఆంజనేయస్వామీ! నన్ను కాపాడుము.

**రాహువు ద్రోసివేసి కడురమ్యత భానుని నోటబట్టి నీ**
**వాహరణంబు జేయగ బలారి నిజాయుధమేయ నీపయిన్**
**నీ హనువాప్రహారమున నీల్గ హనూమతుడైతివో ప్రభూ!**
**పాహి! సువర్చలాహృదయ వల్లభ సుందర వాయునందనా! 6**

వివరణ: సూర్యుని మ్రింగటానికి వస్తున్న రాహువును నెట్టి బాలాంజనేయుడు సూర్యుని నోటబట్టాడు. ఇంద్రుడు తన వజ్రాయుధాన్ని విసరగా అది హనువుకు అనగా దవడకు తగిలింది. దవడ ఉబ్బి గట్టి పడ్డది. అందుచే "హనుమాన్" (హనుమంతుడు, హనూమతుడు) అయ్యాడు. (బల+అరి=ఇంద్రుడు)

## విద్యాభ్యాసము

**పూనిక పాదమొక్కటి యపూర్వ నగోన్నత శృంగమందు నీ**
**వూని, మరొక్క పాదముననూన మహోన్నత పూర్వపర్వతా**
**గ్రానకు జాచి సూర్యముఖ రాజిత బోధల బోద్ధయౌ మహా**
**భావ! సువర్చలాహృదయ వల్లభ సుందర వాయునందనా! 7**

వివరణ: హనుమంతుడు ఒక కాలును తూర్పుపర్వతం మీద, మరొక పాదాన్ని పడమటి (అపూర్వ) పర్వత శిఖరముపైన పెట్టి సూర్యుని గమనం వైపు ముఖం త్రిప్పుతూ, ఆయననుండి నవవ్యాకరణ సహితంగా శాస్త్రాలను నేర్చుకొన్నాడు (బోద్ధ= పండితుడు).

**కొండలపైన నిల్చి మరికోరిక తీరగ సూర్యబోధితా**

**ఖండల శాస్త్ర విద్యలను గాఢ తపస్సున నేర్చినావుగా**
**మెండుగ విద్యనేర్వగల మేటివి పావని! వెల్గువౌదువీ**
**వండ, సువర్చలాహృదయ వల్లభ సుందర వాయునందనా! 8**

వివరణ: మంచి విద్యావంతుడు కావాలనుకొనేవారికి హనుమంతుని కఠోర దీక్ష ఒక వెలుగు. మార్గదర్శి. (వెల్గువు+ ఔ దువు+ ఈవు+ అండ).

## సువర్చలా వాయునందనుల వివాహము

**భాస్కర తేజమీ రమణి, భాసుర లీలను విశ్వకర్మ శ్రే**
**యస్కరు డై సృజించగను నంజని పుత్రుడ! పెండ్లియైతివా**
**హస్కరు సద్గురూదిత మహావచనమ్ముల గారవించి, శో**
**భస్క సువర్చలాహృదయ వల్లభ సుందర వాయునందనా! 9**

వివరణ: సూర్యునిలోని తీక్షణ వర్చస్సును సూర్యుని భార్య సంధ్య సహించలేక పోయింది. సూర్యునిలోని తేజస్సును కొంత తీసివేసి విశ్వకర్మ ఒక కన్యను సృష్టించాడు. ఆమె పేరే సువర్చల. తన కుమార్తెను వివాహం చేసుకుంటేనే విద్యను బోధిస్తానని సూర్యుడు అనటం వలన, హనుమ తన బ్రహ్మచర్య వ్రత దీక్ష భగ్నం కాని విధంగా మాత్రమే చేసుకుంటానన్నాడు. సూర్యుడు అంగీకరించాడు. గుర్వాజ్ఞ మేరకు గురుపుత్రిని హనుమ వివాహం చేసుకొన్నాడు. (శోభస్క= కాంతి గల్గినది, వర్చస్సు= కాంతి. సత్+గురు+ ఉదిత).

**నీవగు పాదపద్మముల నీశ్వర సాక్షిగ సూర్య సంజ్ఞలున్**
**సేవల చేసిసేచనము, చేతుల కూతును బెట్టిరెంతయున్**
**దీవన లీయదేవతలు దీవ్యత దంపతులైన మీరు మా**
**భావి! సువర్చలాహృదయ వల్లభ సుందర వాయునందనా! 10**

**నీ కను చూపువెన్నెల పునీత సువర్చల హ్రీ ముఖాంబు జా**
**తై కనునోరగన్ గళముదావహ మంగళ సూత్ర ధారణన్**
**నాకము నుండి దేవతలు నాశిష వాక్కుల సంస్తుతింపగా,**

**మాకగుగాక సద్గతియు మానస వీధిని గోచరింప, స**

**ద్వాకు సువర్చలా హృదయ వల్లభ సుందర వాయునందనా! 11**

వివరణ: స్వామీ! నీ చూపుల వెన్నెలలో స్నానం చేసి పవిత్రమైన సువర్చల నీవు మంగళ సూత్ర ధారణ చూస్తుండగా సిగ్గుతో తలవంచుకొని నిన్నే చూస్తున్నది ఓరగా. ఇంద్రాది దేవతలు ఆశీస్సు వాక్కులతో సంస్తుతిస్తున్నారు. ఆ దృశ్యాన్ని మనస్సుతో దర్శిస్తున్న మాకు ముక్తి కలుగు గాక!

**దోసిలిలోని ముత్యముల తొయ్యలి నూత్న వధూశిరస్సుపై**

**బోసితివేమొ! నీదు మది భోగములన్విదనాడినట్లుగా,**

**గాసిలిలేని చిన్మయ సుఖాను భవంబుల కోర్కె నామెయున్**

**సేసలు వోసెనేమొ మది శేవధి గాగను తత్త్వలక్ష్మికిన్**

**వ్యాస! సువర్చలాహృదయ వల్లభ సుందర వాయునందనా! 12**

వివరణ: వాయునందనా! సంసార భోగాలను వదిలి వేస్తునట్లుగా క్రొత్త పెళ్ళి కూతురు తలపై తలంబ్రాలను పోస్తున్నావేమో! సత్యసుఖానుభవ వాంఛతో ఆమెకూడ అలానే చేస్తూ పరస్పరం తలంబ్రాలు పోసుకున్నారా! (తపోవ్యాస= వ్యాప్తమైన తపోదీక్ష గలవాడు).

**అంకిలి చెప్పకీవు గురునాజ్ఞ సుకన్య సువర్చలన్వివా**

**హాంకితగా నొనర్చితివి, అంకము పొంకము లేమిలేక వా**

**మాంకమునందు నుంచితివి, మాదగు సేవల స్వీకరింపగా**

**శాంకర తేజ! నీ దయను శాంతియు సౌఖ్యము గల్గ చూడు మా**

**వంక సువర్చలాహృదయ వల్లభ సుందర వాయునందనా! 13**

వివరణ: సువర్చల గురుపుత్రి. గురుపుత్రి సోదరీ సమానురాలు. హనుమ గురువు ఆనతిని ఎదురు చెప్పకుండా అంగీకరించి వివాహ మాడాడు. తన ఎడమ తొడమీద ఆసీనురాలిని చేసాడు. (అంకిలి చెప్పుట= వ్యతిరేకముగా చెప్పుట)

## వివాహిత బ్రహ్మచర్యము

**మారుతి యగ్నిభూతమగు మాన్య సువర్చలదగ్ని తేజ మౌ**
**కారణ మద్ది నేను మదిగంటి వివాహిత బ్రహ్మచారిగాన్**
**మారుతి యందు జేరెనట మానినిరూపగు తేజమింతియే**
**మారుతి బ్రహ్మచర్యమది మార్మిక సత్యపు ధర్మమిట్లు దై**
**వారె సువర్చలాహృదయ వల్లభ సుందర వాయునందనా! 14**

వివరణ: మారుతి (శివాంశతో జన్మించాడు కనుక) అగ్నితత్త్వము గలవాడు. సువర్చల సూర్యుని తేజస్సు వలన నేర్పడినది. ఆ తేజస్సు అగ్ని తత్త్వమే. సువర్చలా రూపమైన అగ్నితేజము మారుతి రూపమైన అగ్ని తేజస్సుతో సంయోగమైనది. అందువలననే మారుతి వివాహిత బ్రహ్మచారి.

## సుగ్రీవునికి సచివత్వము

**రాజట ఋష్యమూకమున రాజిత తేజుడు సూర్య సూనుడే**
**ఆజివిరోధి భీకరుడ! అంజని పుత్రుడ! మంత్రి వీవయై**
**రాజులు వానరేంద్ర రఘురాముల మైత్రిని కూర్చు సంధి వి**
**భ్రాజ! సువర్చలాహృదయ వల్లభ సుందర వాయునందనా! 15**

వివరణ: ఆజి విరోధి భీకరుడు= యుద్ధంలో శత్రుభయంకరుడు
విభ్రాజ=ప్రకాశించువాడా!

**నీవల ఋష్యమూకమున నీరజ బంధుని కోర్కె మీర సు**
**గ్రీవుని మంత్రివై హితవరేణ్యుడు రాముని మైత్రి గూర్చి సు**
**గ్రీవుని రాజు జేసితివి, క్రీడగ వాలిని రామబాణని**
**ర్జీవుని జేసి చాటితివి సేవక ధర్మము, రామమంత్ర సత్**
**భావ! సువర్చలాహృదయ వల్లభ సుందర వాయునందనా! 16**

వివరణ: సూర్యుని కోరికపై హనుమంతుడు సుగ్రీవునికి మంత్రిగా ఉన్నాడు. రామునిచే వాలిని చంపించి, సుగ్రీవుని రాజునుచేసి తన ధర్మాన్ని, మంత్రాంగాన్ని నిర్వర్తించాడు. (నీరజ బంధుడు= పద్మములకు మిత్రుడు. సూర్యుడు)

**వారిజ మిత్రసూతికిని వారిజనేత్రుడు రామమూర్తికిన్**
**వారక మైత్రిగూర్చితివి, వాలి సహోదరుదానతీయ దై**
**వారగ చూచివచ్చి తివి పావని సీతను లంకలోన నిం**
**పార! సువర్చలాహృదయ వల్లభ సుందర వాయునందనా!** **17**

వివరణ: వారిజమిత్ర సూతి= పద్మముల మిత్రుడైన సూర్యుని కుమారుడు సుగ్రీవుడు. వారక= అధికమైన, అడ్డులేని.

**దుష్టముగాని భాషణ మృదూక్తి సుమౌక్తిక జాలముల్మనో**
**ద్దిష్ట ఫలంబు నిచ్చుటను ధీవర చూపితె రామసన్నిధిన్**
**తుష్టముగాగ వేదముల, దుస్సహ సూర్య మహాగ్ని తేజస**
**త్వష్ట సువర్చలాహృదయ వల్లభ సుందర వాయునందనా!** **18**

వివరణ: మృదువైన చక్కని మాటలు కార్యాన్ని సాధించి పెడతాయి. హనుమంతుడు సూర్యుని వద్ద వ్యాకరణాది శాస్త్ర విద్యలను నేర్చుకొన్నాడు. సుగ్రీవుని మంత్రిగా రామలక్ష్మణులతో చాతుర్యంతో మాట్లాడి సంధిని కూర్చాడు. శాస్త్రాభ్యాసం చక్కని సంభాషణా నైపుణ్యాన్ని కలిగిస్తుందని భావం.

(మనః+ఉత్+ఇష్ట=మనస్సు కోరుకున్న; తేజసత్వష్ట=తేజస్సులో త్వష్ట అంతటి వాడవి)

## సుందరకాండ సుందరుడు

**సుందరకాండ సుందరుడు సూర్యమహోజ్జ్వల తైజసుండు ధీ**
**సుందరు డెందమందెలమి సుందర రాముడు నిండియుండ నా**
**సుందరి సీతజాడగని సుందర లంకను కాల్చు వంద్యుడీ**
**వందు సువర్చలాహృదయ వల్లభ సుందర వాయునందనా!** **19**

వివరణ: వంద్యుడు- నమస్కరింప దగినవాడు. డెందము= హృదయము వంద్యుడు+ఈవు+అందున్.

## సముద్రలంఘనము

**అట మినుదాకినట్టి ఘనుడారయ నెంతటి దీర్ఘదేహుడ**
**న్నటుల, మహేంద్ర పర్వతమునాహతి జేసి చలింప జేయు వా**
**డెటుల మహోన్నతుండనగనేల! మహాబల మమ్ముకావుమీ!**
**వటుల సువర్చలాహృదయ వల్లభ సుందర వాయునందనా! 20**

వివరణ: మహేంద్ర పర్వతాన్ని కుదిపిన వాని బలమెంత అని అడగటం ఆకాశాన్ని అంటుకున్నవాడి ఎత్తెంతని అడిగినట్లుంటుంది. (హనుమ మహేంద్ర పర్వతాన్ని ఒక్క కుదుపు కుదిపి ఎగిరి వెళ్ళాడు. (మిన్ను= ఆకాశము)

**గరిమ మహేంద్ర పర్వత శిఖావిచరత్ కరిరాజ సంఘ ఘీం**
**కరనినదంబు లొక్కట ప్రకంపక భీషణ ఘోషణంబులై**
**పరగ నగంబు క్రుంగగ సుపర్వ సుపర్వణ లీల లేచు ధీ**
**వరుడ! సువర్చలాహృదయ వల్లభ సుందర వాయునందనా! 21**

వివరణ: 'గరిమ'– అష్టసిద్ధులలో ఒకటి. అంతటికంటె పెద్దది లేదన్నంత రూపాన్ని పొందటం. హనుమ మహేంద్ర పర్వతం మీద తన శరీరాన్ని విశ్వరూపంగా పెంచి పర్వతాన్ని ఒక్క కుదుపు కుదిపాడు. ఆ పర్వతం మీద సంచరించే ఏనుగులు భయంకరంగా ఘీంకారాలు చేసాయి. కొండ క్రుంగింది. అది దేవతలకు పండుగలా ఉంది.

(సుపర్వులు=దేవతలు; సుపర్వణలీల= ఉత్సవము వలె)

**గగన తలానికిన్నిలకు కన్గొన దూరము లేదు లేదు నీ**
**వగణిత విశ్వరూపమున వైరివిభీషణ దీర్ఘ దేహివై**
**నగమది క్రుంగగా నెగసి నావుగ సీతను లంకలోన నీ**
**వగన, సువర్చలాహృదయ వల్లభ సుందర వాయునందనా! 22**

వివరణ: హనుమా! ఆకాశానికి భూమికి దూరం లేదన్నంత ఎత్తుగా శత్రుభయంకర

విశ్వరూపాన్ని పొంది, పర్వతము క్రుంగునట్లుగా ఎగిరి వెళ్ళావు. లంకలో సీత జాడను కనుగొన గలిగిన వాడివి నీవే సుమా!

**అలపది లేక యోజన శతాన్విత దూరము లంఘనంబనా**
**విలమతి వాయువేగమున వేటున చేసి గభీర వార్ధిన**
**వ్వలి దరి జేరినాడవు దివౌకసమోద! సురక్ష నీవ కా**
**వలయు! సువర్చలాహృదయ వల్లభ సుందర వాయునందనా! 23**

వివరణ: నూరు యోజనముల దూరమున్న సముద్రాన్ని వేటువేసినట్లు ఒక్క ఉదుటున అవతలి తీరానికి చేరాడు ఆంజనేయుడు.

(అనావిలమతి= పవిత్ర హృదయము గలవాడు; దివౌకసులు= దేవతలు. యోజనము= ఆమడ, 4 క్రోసులు)

**చతుర విచార ధీరమతి! చారణ మార్గము నందు బాహుల**
**ద్భుతముగ జాచి, భూమి సమదూరముగాగ విపాట వృక్షముల్**
**ఋతముగ వెన్దగుల్కొన, పరీక్ష తితీర్షయనంగ సాగుసు**
**వ్రతుడ! సువర్చలాహృదయ వల్లభ సుందర వాయునందనా! 24**

వివరణ: హనుమంతుని వేగానికి వృక్షాలు పెకలించబడి, వెనుక అనుసరిస్తూ రాగా, దీర్ఘమైన బాహువులను ముందుకు చాచి, సముద్రాన్ని దాటటమనే పరీక్ష నెగ్గటం కోసం దీక్షతో హనుమ ముందుకు సాగుతున్నట్లున్నది. (చారణ మార్గము= చారణులు దేవతా గణాల్లో ఒక గణము వారు ఆకాశంలో సంచరించే మార్గము. విపాట=పెకలింపబడిన, తితీర్ష=దాటాలనే కోరిక, ఋతముగ=సత్యముగా, తిన్నగా)

**కార్యము సాధ్యమౌటకును కావలయుందగ బుద్ధి నైపుణం**
**బర్యమ శిష్యుడా! సురస నంబుధి నుక్కణగించి, నమ్మహా**
**క్రౌర్యను సింహికన్ దునిమి, రౌద్రిణి లంకిణి గూల్చినావు ధీ**
**వర్య! సువర్చలాహృదయ వల్లభ సుందర వాయునందనా! 25**

వివరణ: అర్యముడు=సూర్యుడు

**రెక్కలు లేని పర్వతము, ఋక్కుల జూడని మేఘమద్ది తా**
**వెక్కడ లేదు చూడగను, నెక్కటి నూర్వులు దీర్ఘబాహులున్**
**దిక్కులు పిక్కటిల్లెదు మదేభమహోగ్రపు ఘీంకృతంబులున్**
**చుక్కలు తాకునట్లెగసి చూడ్కికి మిక్కుటమైన వేగము**
**న్నెక్కడి కేగుచుండెనని యిమ్మగు చూపుల నా సుపర్వులున్**
**చిక్కును నాంజనేయునకు సీతను దాచిన చోటటంచు తా**
**మ్రొక్కు దురాపరాత్పరికి మ్రొక్కుదు మారుతి! నీవు నిల్వనా**
**ప్రక్క, సువర్చలాహృదయ వల్లభ సుందర వాయునందనా! 26,27**

వివరణ: ఋక్కులు=ఋగ్వేద మంత్రాలు; ఎక్కటి=పోల్చలేని; మారుత+ఆత్మజుడు= వాయువు యొక్క కుమారుడు, సుపర్వులు= దేవతలు, పరాత్పరి=పరాశక్తి; ఊర్వులు= తొడలు.

## లంకిణీ మర్దనం

**తోకను చుట్టి గుండ్రముగ దుమ్మును రేపుచుకొట్టినేలపై**
**భీకర రావమొందుచు బిభీషిక నార్చుచు గంతులేయుచున్**
**ఢీకొని ముష్టిఘాతమున డీల్పడ లంకిణి గూల్చినావు ధీ**
**వాక! సువర్చలాహృదయ వల్లభ సుందర వాయునందనా! 28**

వివరణ: బిభీషిక= భయపెట్టుట; సుధీవాక= మంచి మేథస్సుకు స్థానమైనవాడు.

## జానకీ మాత దర్శనము

**ధవళపు కాంతులీను పరిధానము, పింగళకాంతి మేనితో,**
**పవడ మొగంబుతో చిరుత ప్రాయపు రూపున రామగాథ న**
**య్యవనిజ కర్ణపేయముగ నాలపనంబొనరించి ప్రీతితో**
**పవన సుతుండ శింశుప సుపాదప మూలను గాంచు రక్షనీ**
**వవుదు సువర్చలాహృదయ వల్లభ సుందర వాయునందనా! 29**

వివరణ: తెల్లని వస్త్రాన్ని ధరించి గోరోచన కాంతి వంటి మేనికాంతిలో, పగడము

వంటి ఎఱ్ఱని ముఖంతో పిల్లకోతిగా మారి హనుమ శింశుపా వృక్షమూలమున సీతను జూచి, ఆమెకు కర్ణపేయంగా రామకథను వినిపించాడు.

**పావని రోమ రోమమున పావన రామ జపంబు విన్పడున్**
**పావని జానకీ మనము పాయదు రామ జపంబు నెయ్యెడన్**
**పావని సీతజాడ గన పావన మారుతికౌననంగ నిన్**
**భావన చేసి దేవతలు పాయని దీవన లీయరే! మహా**
**భావ! సువర్చలాహృదయ వల్లభ సుందర వాయునందనా! 30**

వివరణ: పావని= పవిత్రమైనది సీత. పావని= పవనుని కుమారుడు హనుమ.

**ఎంతటి వాడవీవు, మరియింతటి రూపున శింశు పమ్ముపై**
**పంతముబూని కూర్చొనియు, వంతలు చెందెడి మాత జానకీ**
**చెంతను మోదమొందితివి, చిందులు వేయుచు కొమ్మ రెమ్మలన్**
**చింతలు బాపినావు గద సీతకు, నట్టులె బాపు మీవు మా**
**వంత సువర్చలా హృదయ వల్లభ సుందర వాయునందనా! 31**

వివరణ: వంత= బాధ. బాపుట= పోగొట్టుట

**లవణ సముద్ర లంఘన కలాప విలాస కపీశ! మారుతీ!**
**పవనమె పథ్యమైన ధృత పావన జీవని సీత జాడ రా**
**ఘవునకు జెప్పి కూర్చితివి కామిత మోదము నీకు వందనం**
**బవుర సువర్చలాహృదయ వల్లభ సుందర వాయునందనా! 32**

వివరణ: సువర్చలా హృదయ వల్లభుడవైన ఓ సుందర హనుమా! స్వామీ! నీకు నమస్కారము. లవణ సముద్రమును ఒక విలాసక్రీడగా దాటి గాలిని మాత్రమే ఆహారంగా తీసుకొంటూ జీవిస్తున్న సీత జాడనుగని శ్రీరామునకు చెప్పి ఆనందము కూర్చినావు గదా!

**గోష్పదమౌను సంద్రమరికూటమి దోమలవోలె నీకగున్**
**పుష్పకయాను రావణునపూర్వ మనోహర వైభవున్ భళా!**

**నిష్ఫల తేజు చేయగను నేగు కపీశ్వర! భాస్కర ప్రభా**
**పౌష్ప! సువర్చలాహృదయ వల్లభ సుందర వాయునందనా! 33**

వివరణ: భాస్కర తేజస్సు అనే పుష్పానికి సంబంధించిన (పౌష్ప) సువర్చలాదేవి మనోనాధుడవైన ఓ వాయునందనా! పుష్పక విమానం మీద తిరిగే రావణుని వైభవాన్ని నశింపజేయటానికి లంకలోనికి వెళుతున్న ఓ వానర రాజా! నీకు సముద్రము గోవు పాదమంత అల్పమైనది. శత్రువులు దోమల వంటి అల్పజీవులు.

## అతిథి మర్యాద

**అతిథిని గారవించుటది హైందవ ధర్మము గాన మేనకా**
**సుతుడు నిజప్రదేశ పరిచుంబిత యానుడవైన నిన్ను, తా**
**నతిథి సమర్చనంబునకునై తగ నిల్పెను చూవె! నీవెకా**
**వతిథి సువర్చలాహృదయ వల్లభ సుందర వాయునందనా! 34**

వివరణ: ఆంజనేయస్వామి సముద్రమును దాటుసమయంలో, సముద్రగర్భంలో నున్న మైనాకుడు, తనపై నుండి వెళుతున్న హనుమంతునికి ఆతిథ్యమివ్వటం కోసం పైకివచ్చి అడ్డునిలిచి స్వామిని ఆహ్వానించాడు.
(పరిచుంబిత= తాకుచున్న, నీ గతిన్= నీ మార్గమును)

## సంక్షిప్త సుందరకాండ

**ఉప్పు సముద్రము న్నొకట నుప్పర వీధికి బ్రాకి దాటుటల్,**
**చప్పున సీత జాడగని చయ్యన ముద్రిక నిచ్చి రత్నమున్**
**అప్పన గాగ గైకొనియు, నవ్వన భూమిని చెట్లు కూల్చియున్,**
**గుప్పగ నింద్రజిత్తు తనకోర్వని బ్రహ్మకు లొంగి యుండుటల్,**
**తప్పక రావణుందరికి తార్చగ, లంకను గాల్చి వచ్చు నీ**
**గొప్పకు వందనంబు లివి గొల్తు సమీర కుమార మాకు నీ**
**వప్ప- సువర్చలాహృదయ వల్లభ సుందర వాయునందనా! 35**

వివరణ: ఉప్పర వీధి= ఆకాశమార్గము, గుప్పగ= బాణాలను ప్రయోగించగ,

బ్రహ్మకు= బ్రహ్మాస్త్రమునకు, తార్చగ= తీసుకొని పోగా, నీవు+అప్ప= నీవే తండ్రివి.

## రామలక్ష్మణులకు వాహనంగా....

**భుజముల మీద నిల్పుకొని బొమ్మల వోలెను నుత్సవంబుగా**
**ప్రజలు గజాధిరోహణ విరాజులు రాముదు లక్ష్మణుండనన్**
**ప్రజ నినుజూచి పొంగ మహిరావణు బారి వదల్చి తెచ్చి తౌ!**
**వాజి సువర్చలాహృదయ వల్లభ సుందర వాయునందనా!** **36**

వివరణ: ఆంజనేయస్వామి రామలక్ష్మణులను తన భుజములపై కూర్చొనబెట్టుకొని మైరావణు బారి నుండి తీసుకొని వస్తాడు. (గార్ధభాసుర సంహార విషయంలో ఓడిన శివుడు ప్రతిజ్ఞ ప్రకారం హనుమ రూపంలో– రామ రూపంలోని విష్ణువును భుజములపై మోసాదు)

వాజి= గుఱ్ఱము; వాహనము. రామలక్ష్మణులకు వాహనమయ్యాడు.

## లాంగూల విన్యాసము

**వాలము చేతబట్టి కరవాల విహార వినోద లీలగా**
**జ్వాల రగిల్చ రావణుదు జాలము జూపియు లంక గాల్చి, ని**
**ర్మాలము చేయజాలు పరమోద్ధతి చూపితి మ్రొక్కెదన్ మహా**
**వాలి! సువర్చలాహృదయ వల్లభ సుందర వాయునందనా!** **37**

**వాలము త్రిప్పికొట్టియరివారణ యూధము కూలగొట్టి నీ**
**వాలము చేయకన్గొనుచు, వాలము ముడ్చియు శౌర్యహీనులై,**
**కాలుని వోలె నిన్దలచి, కాలికి చెప్పిరి బుద్ధి ఓ! మహా**
**వాలి! సువర్చలాహృదయ వల్లభ సుందర వాయునందనా!** **38**

వివరణ: అరి వారణ యూధము= శత్రువులనే ఏనుగుల గుంపు, నీవు+ ఆలము చేయ= నీవు యుద్ధము చేయుచుండగా, కాలుని వోలె= యముని వలె, మహావాలి= గొప్ప తోక గలవాడు.

**వాలము కాలనాగమరి వాయువులన్ తెగ మ్రింగు, నా మహా**
**కాలుని రీతి, భక్తులకు కావలి యౌచును నాగ దోషముల్**
**తోలుచు, కామితార్థముల తోరము లాంగుల మిచ్చుగా మహా**
**వాలి! సువర్చలాహృదయ వల్లభ సుందర వాయునందనా!** **39**

వివరణ: కాలనాగము= కాలసర్పము. అరి వాయువులన్= శత్రువులనే వాయువులను. కామిత+అర్థములు= కోరిన ప్రయోజనములు. ఆంజనేయస్వామి వాలము కాలనాగము వంటిది. సర్పములు గాలిని ఆహారంగా తీసుకొంటాయి. హనుమంతుని వాలము కాలనాగమై శత్రువులనే గాలిని మ్రింగేస్తుంది.

**వాలము త్రిప్పి నీవు సురవైరుల నేలను గొట్టి చీల్తు! రా**
**వేలనొ! నా మనంబు నిరవై నెలకొన్న విరోధి షట్కమున్**
**కూలగ జేసి నా హృదిని, క్రొన్నెలవై తిర మౌదువో మహా**
**వాలి! సువర్చలాహృదయ వల్లభ సుందర వాయునందనా!** **40**

వివరణ: సురవైరులు= దేవతల శత్రువులు, రాక్షసులు. ఇరవు= స్థానము, విరోధి షట్కము= ఆరుగురు శత్రువులు (అరిషడ్వర్గము), తిరము= స్థిరము, ఇరవు= స్థానము.

## సీతాదేవికి రుద్ర దర్శనము

**“జీవమునిచ్చె మారుత”ని, సీతకు నీపయినెంత ప్రీతి సం**
**జీవని రాయడంచు నిను జీరుచు విందుకు బిల్వ, తల్లికిన్**
**తావక రుద్రరూపమున దర్శన మిచ్చిన సామి! నీవె మా**
**భావి! సువర్చలాహృదయ వల్లభ సుందర వాయునందనా!** **41**

వివరణ: సీతమ్మ హనుమంతుని భోజనానికి ఆహ్వానించింది. స్వామి యొక్క అంతులేని భోజన ప్రమాణానికి నివ్వెరపోతూ అప్రయత్నంగా శివుని ధ్యానించింది. అంతే ఆంజనేయస్వామి రుద్రరూపుడై దర్శనమిచ్చాడు.

(సంజీవని రాయుడు= సంజీవని పర్వతాన్ని తీసుకొచ్చినవాడు. సంజీవరాయా! అని హనుమను స్తుతిస్తారు)

## ఆంజనేయుని హృదయంలో రాముడు

**గుండెలు చీల్చి చూపితివి కోసలరాజ కుమార్తె సూనును**
**ద్దండ పరాక్రమున్, పరమ ధర్మరతున్, నిజభక్త రక్షు, కో**
**దండ గుణ క్వణద్విగత ధైర్య రిపున్, రఘు రాము నీవెకా**
**వండ సువర్చలాహృదయ వల్లభ సుందర వాయునందనా! 42**

వివరణ: కోదండ= రాముని వింటి యొక్క; గుణ= నారి యొక్క; క్వణత్= శబ్దము వలన; విగత= కోల్పోయిన; ధైర్య= ధైర్యముగల; రిపున్= శత్రువులు గలవానిని. (రాముని వింటి నారి శబ్దం వింటేనే శత్రువులు ధైర్యం కోల్పోతారు)

## పంచ భూతాత్మకుడు

**<u>వాయు</u>వు వల్లబుట్టి, తనివారగ <u>నాకస</u> వీథి బ్రాకియున్,**
**తోయపు మూలమౌ <u>జల</u>ధి దూరమపారము దాటి, లంకలో**
**నాయమ <u>భూ</u>జ జూచి, తుదన<u>గ్ని</u>కి లంకను నాహుతిచ్చితీ**
**వాయె సువర్చలాహృదయ వల్లభ సుందర వాయునందనా! 43**

వివరణ:1) ఆకాశము, 2) వాయువు, 3) అగ్ని, 4) నీరు, 5) భూమి ఇవి పంచభూతములు. ఆంజనేయుడు 1) 'వాయువు' వలన జన్మించాడు. 2) 'ఆకాశము'నకు ఎగిరాడు. 3) నీరు (సముద్రము)ను దాటాడు. 4) భూమి పుత్రి సీతను చూచాడు. 5) అంకను 'అగ్ని'కి ఆహుతాచ్చాడు.

భూజ= సీత.

## అద్వైతము

**దాసుడ వీవు రామునికి దానవ నాశక రామమూర్తికిన్**
**భాసిత మానుషంబమల బంధన మేర్పడ గల్గె నీవిధిన్**
**వాసిగ మీరలొక్కరయి వాసన లెన్నని శాశ్వతుల్ మనో**
**వాస! సువర్చలాహృదయ వల్లభ సుందర వాయునందనా! 44**

వివరణ: ఆంజనేయస్వామి రామునికి దాసుడు. వారిది స్వామి- దాసుల సంబంధము. ఈ సంబంధము కేవలము మానుషమైనది. కాని వారిద్దరు

మానవీయమైన జనన మరణ సంబంధ వాసనలు లేని శాశ్వతులు. ఇరువురు ఒక్కరే.

**జీవమునీవు భక్తులకు శేషిత కర్మవిపాక హేతువే**
**నీవ! భవాబ్ధి తారణివి నీవయి గమ్యము చేర్చుమో ప్రభూ!**
**కేవలమైన బ్రహ్మ పరిఖేలన నీదగు వృత్తమౌ! మహా**
**భావ! సువర్చలాహృదయ వల్లభ సుందర వాయునందనా! 45**

వివరణ: నా మనస్సున భావింపబడే సువర్చలా ప్రాణేశ్వరుడవైన ఓ వాయునందనా! నీ భక్తుల (సర్వప్రాణుల) జీవము నీవే. మిగిలిపోయిన కర్మలను వినాశనం చేసే వాడవు నీవే. కేవల పరబ్రహ్మము యొక్క క్రీడా విశేషమే నీ లీల. ఈ సంసార సాగరము నుండి నన్ను దరిజేర్చుము ప్రభూ!
కర్మ విపాకము= కర్మముల పర్యవసానము (లయింపజేయుట)
భవాబ్ధి= సంసారమనే సాగరము. తారణి= దాటించేవాడు. పరిఖేలన= క్రీడ.

**ప్రాణుల చేతనా క్రియలు, వాయు వినిర్గమమాగమంబులున్**
**ప్రాణము గాదు, కాదు మరి రాగ విరాగపు నిర్గుణంపు వి**
**న్నాణము, బ్రహ్మయే యగుననంగను పల్కితివాత్మ తత్త్వవి**
**ద్వాణి సువర్చలాహృదయ వల్లభ సుందర వాయునందనా! 46**

వివరణ: హనుమస్వామి భీమునకు పరతత్త్వాన్ని గురించి చెబుతూ యీ మాట లంటాడు. జీవుల చేష్టలుగాని, ఉచ్ఛ్వాస నిశ్వాసలుగాని ప్రాణం గాదు. కేవల రాగ విరాగశూన్యమైన జ్ఞానం కాదు. పరబ్రహ్మమే, పరతత్త్వమే ప్రాణ స్వరూపము.
వినిర్గమము= బయటకు వెళ్ళుట, ఆగమము= లోనికి వచ్చుట, విన్నాణము= విజ్ఞానము.

**దాసుడ వీవు రామునికి, ధారుణి దేహపు ధర్మబద్ధతన్**
**దోసము లేని జీవ పరితోషిత బుద్ధిని యంశ మాత్రులు**
**న్వాసిగ చూడ నిర్వొరొక నాణెము మాత్రపు టేకరూపు సం**
**వాస! సువర్చలాహృదయ వల్లభ సుందర వాయునందనా! 47**

వివరణ: మానవ జీవన ధర్మం ప్రకారం హనుమ రామునికి దాసుడు. నిష్కళంకుడు. హనుమ, రామచంద్రస్వాములలో మానుషధర్మం ఒక అంశమాత్రమే. తారతమ్యములు లేవు. ఒకే నాణెం రెండు వేర్వేరు ముఖాలు గలిగియుండునట్లుగా నిర్వురు ఒక్కరే.

## భిన్నరూపములు

**భక్తులు నిన్నుగొల్చెదరు భావన చేయుచు భిన్నమూర్తులన్,**
**రక్తిని వీరరూపొకటి, రంజిల కోర్కెలు తీర్చునట్టి యా**
**సక్తత సుప్రసన్నుడగు శాంతునిదొక్కటి రామమూర్తికిన్**
**భక్త! సువర్చలాహృదయ వల్లభ సుందర వాయునందనా!** **48**

వివరణ: వీరాంజనేయస్వామి, ప్రసన్నాంజనేయస్వామి, దాసాంజనేయస్వామి మొదలగు తొమ్మిది రూపాలు గలవాడు స్వామి.

## సింధూర చర్చ

**సింధుర మద్ది నీకు మరిసేయుదు పూజల నాంజనేయ! రా**
**గాంధుడ, భక్తిబంధితునిగా నను జేయుము దోసిలొగ్గి నే**
**బంధుర రక్తి వేడెదను బాధల బంధము త్రెంచ దిక్కు నీ**
**వందు సువర్చలాహృదయ వల్లభ సుందర వాయునందనా!** **49**

వివరణ: రాగ+అంధుడు= కోరికలచే గ్రుడ్డివాడు.

**జానకి పాపటన్ వెలుగు చక్కని సింధురరేఖ జూచియా**
**జానకి రాముదత్తరిని సంతస మందగ, తైలసింధురం**
**బౌనని మేన దాల్చితివి భౌమ సువాసరమందు నీకు నిం**
**పౌను సువర్చలాహృదయ వల్లభ సుందర వాయునందనా!** **50**

వివరణ: రాముడు జానకితో గడుపుతూ తనను దూరంగా ఉంచటానికి కారణం, జానకి పాపట ధరించే సింధూరమేనని భావించాడు బ్రహ్మచారి హనుమ. రామునికి ఆనందం కలిగించాలనే తలంపుతో ఒకనాడు సింధూరాన్ని తైలంతో కలిపి

శరీరమంతా పూసుకొన్నాడు. ఆ రోజు మంగళవారం- సింధూర చర్చకు, మంగళవార ప్రాధాన్యతకు ఈ ఉదంతమే కారణం. ఆ సింధూర చర్చ హనుమకు ఎంతో అందాన్నిచ్చింది కూడ.

## గంధమాదన నిలయుడు

**కుదురగు గంధమాదన నగోన్నత సీమల సూర్యతేజువై**
**కదళి వనంపు కాంచన వికాస మనోహర దివ్యధామమున్**
**ముదమున పారిజాత తరుమూలము నుందువు యోగనిష్ఠతో**
**ముదిత మనస్కులై సురలు మ్రొక్క జనంబు నుతింప కావుమీ**
**వ, దయ సువర్చలాహృదయ వల్లభ సుందర వాయునందనా!** **51**

వివరణ: కదళి వనము= అరటి వనము; ధామము= నిలయము
తరుమూలము= చెట్టు మొదలు; సురలు= దేవతలు
కావుము+ఈవ+దయ= నీవే దయతో కాపాడుము.

## పంపాతీర విహారము

**పావన పంప తీరమున బంగరు కాంతు లనంటి తోటలో**
**సేవలు చేయ నీలుడు, సుశిక్షిత మైందుడు, సైన్యనాయకుల్**
**పావన తేజ, నీవ కొలువౌదురు తీవిగ, కావుమో మనో**
**భావ! సువర్చలాహృదయ వల్లభ సుందర వాయునందనా!** **52**

వివరణ: అనంటి= అరటి

## హనుమన్ మహావిద్య

**ద్వాదశ మంత్ర విద్యలను వశ్యముగా వెలుగొందు మంత్ర మౌ**
**నీదగు మూలమంత్రమును నేమము తోడ జపించు వారికిన్**
**స్వాదు ఫలంబులిచ్చెదవు సూనృత సువ్రతు లొప్పు దిక్కు నీ**
**వౌదు! సువర్చలాహృదయ వల్లభ సుందర వాయునందనా!** **53**

వివరణ: 12 మంత్ర విద్యలలో హనుమన్ మహా మంత్ర విద్య మహిమాన్వితమైనది. (స్వాదు ఫలము= ఆనందాన్నిచ్చే ఫలము; సూనృతులు= సత్యశీలుడు)

## హుంకార మహిమ

సారము కోల్పడన్ సురలు సారసలోచను వేడ హుం
కారము చూపి రాక్షసుల క్రౌర్యము కీడ్వడ జేసి, బ్రోచి తోం
కారము సాటి హుంకృతము, కామిత సిద్ధికి సిద్ధమంత్రమీ
వౌర! సువర్చలాహృదయ వల్లభ సుందర వాయునందనా! 54

వివరణ: శివుని వరంతో రాక్షసులు మహాబలురై అజేయులయ్యారు. బ్రహ్మాది దేవతలు శివుని ప్రార్థించగా "వానర రూపంలో నేనే వారిని శక్తిహీనులను చేస్తాను. అప్పుడు మీరు వారిని సంహరించండి" అన్నాడు. కాలాంతరంలో హనుమను దూషిస్తూ రాక్షసులు దేవతలపైకి విజృంభించారు. స్వామి 'హుం' కారం చేసాడు. అంతేకాదు 3 శిరస్సులు, 6 నేత్రాలు, 32 భుజాలు, కత్తుల వంటి రోమాలతో మహా భయంకరంగా కనిపించాడు. రాక్షసులు భయ విహ్వాలులయ్యారు. దేవతలు వారిని సంహరించారు. (కీడ్వడుట= నశించుట)

## హనుమత్ భాష్యం

వ్యాకరణాది శాస్త్రముల, వైదిక విద్యల నేర్చినట్టి నీ
వాకది సత్యవాక్కుగును వాఙ్మయ మూర్తివి కృష్ణగీతకున్
ప్రాకట భాష్యమున్ పరగ వ్రాసితివాశిషంబు నీ
వాకు సువర్చలాహృదయ వల్లభ సుందర వాయునందనా! 55

వివరణ: భారత యుద్ధభూమిలో శ్రీకృష్ణుడు అర్జునునకు బోధించిన గీతను, విజయుని జెండాపై ఉన్న హనుమంతుడు విని, కృష్ణునకు నమస్కరించి నేను ధన్యుడనయ్యానని అన్నాడు. తన అనుమతి లేకుండా గీతను విన్నందుకు హనుమను పిశాచమయి గీతకు భాష్యం వ్రాసి ప్రాయశ్చిత్తం చేసుకొమ్మన్నాడు. ఆ గీతాభాష్యం హనుమత్ భాష్యంగా ప్రసిద్ధి గాంచింది.

## శనికి తైలాభిషేకం- ఆంజనేయునకు శనివార పూజ

హనుమను బాధపెట్టదలచా హనుమంతుని చేత నీల్గ నా
శనికి శరీర బాధలవి చక్కనణంగెను తైల మర్దనన్

**శనికిని తైల సేచన ప్రశస్తి, కపీశుని పూజ చేయు వా**
**రి నిల శనైశ్చరుండెలమి ప్రీతియొనర్చు నుతింతు మూలమీ**
**వనగ సువర్చలాహృదయ వల్లభ సుందర వాయునందనా! 56**

వివరణ: శని హనుమతో నేను నిన్ను పీడిస్తానన్నాడు. ఎలా పీడిస్తావో చెప్పమన్నాడు. నెత్తిమీద కూర్చొని పీడిస్తానన్నాడు. ఐతే కూర్చొనమన్నాడు. శని హనుమ నెత్తిమీద కూర్చున్నాడు. హనుమ ఒక పర్వతాన్నెత్తి తన నెత్తిమీదున్న శని నెత్తిమీద పెట్టాడు. శని భరించలేక తనను మన్నించమని వేడుకున్నాడు. శని తన శరీర బాధలు తగ్గటానికి శరీరమంతా తైలాన్ని రాసుకున్నాడు. తనను అర్చించే వారికి శని ఏ విధమైన హాని చేయకూడదని ఆంజనేయుడు శని వద్ద మాట తీసుకున్నాడు.

ఆ విధంగా శనికి తైలాభిషేకం– హనుమకు శనివార పూజ ప్రాధాన్యతను సంతరించు కొన్నాయి.

(శనైశ్చరుడు= నెమ్మదిగా నడచేవాడు, శనీశ్వరుడు అని అనరాదు)

## ఊరూర అంజనేయ విగ్రహాలు

**చూడగ రామమందిరము చూడని యూరది లేదొకప్పుడున్**
**వేడుక నీదు విగ్రహపు వీక్షణ రక్షణ మోచనంబు లె**
**వ్వీదున నైనగాననగు వీడకు మెప్పుడు నిన్దలంచు నీ**
**వాడ! సువర్చలాహృదయ వల్లభ సుందర వాయునందనా! 57**

## శరణాగత రక్షణ

**అమ్మ పదాంబుజ స్మరణకౌనన మిన్నది లేదు లేదుగా**
**అమ్మకు నిష్టమైన పనికాచరణంబున మిన్న లేదుగా**
**ఇమ్మగు రామభక్తికిని యెన్నను మిన్నగు నమ్మ మాటయే**
**సుమ్ము! యయాతి రక్షణకు శూరత రామునెదిర్చినాడ వీ**
**వమ్మ! సువర్చలాహృదయ వల్లభ సుందర వాయునందనా! 58**

వివరణ: యయాతి రామశపథ బారి నుండి కాపాడమని అంజనీ దేవిని ప్రార్థించాడు. ఆంజనేయడు అమ్మయిచ్చిన అభయాన్ని నిలబెట్టుకోవటం కోసం

తన స్వామి రామునెదిరించాడు. మాతృదేవోభవ.

**శరణము కోరువాడు, బలశాలిశరణ్యుడు రామభక్తులే**
**శరమును చేతబట్టి మరి శప్తుని చంపెడివాడు రాముడే**
**అరసిన తేటతెల్లమగు నంచిత సత్యమదెల్ల నొక్కటే**
**శరణు శరణ్యమున్ మరణ సారపు మూలమునైన తత్త్వమీ**
**వరయ సువర్చలాహృదయ వల్లభ సుందర వాయునందనా! 59**

వివరణ: వాయునందనుని శరణుకోరిన యయాతి రామభక్తుడు. అభయమిచ్చిన వాడు రామభక్తుడే. యయాతి చంపుతానని శపథము చేసినవాడు రాముడే. "చంపేవాడు- చంపబడేవాడు- శరణమిచ్చినవాడు" - అందరు ఒక్కరే... అదే యిందలి తత్త్వము.

## అర్జున కపిధ్వజము

**విజయుని కేతనంబుపయి విశ్వవిజేతవు నీవునిల్చి ది**
**గ్విజయము గూర్చినావు విజిగీషువు లెవ్వరు నిన్ను వేడుచున్**
**భజన యొనర్చి మంత్రము జపంబును సేతురొ వారి సేమమున్**
**నిజముగ గాంతు వీవు హరినేత! హృదంతరవర్తివీవెగా**
**భజిత సువర్చలాహృదయ వల్లభ సుందర వాయునందనా! 60**

వివరణ: విజిగీషువు= జయించాలనే కోర్కె గలవాడు. (జీగీషువు)

**విజయుని కేతనంబు పయి వెల్గి విరోధుల కంటి చూపుతో**
**నజయుల జేయ నర్జున మహా విజయుండని కీర్తిగల్గె గా**
**విజయ మనంగ నీదె నిరపేక్షిత వీర వరేణ్య! కావు మీ**
**వ! జయ సువర్చలాహృదయ వల్లభ సుందర వాయునందనా! 61**

వివరణ: నిరపేక్షిత= కోరబడని

అర్జునుని జెండాపై ఉన్న హనుమతుడు శత్రువుల బలాన్ని ఆకర్షించాడు. అందుకే పాండవ విజయం హనుమంతునిదే గాని అర్జునునిది కాదని భావం.

## ద్వాదశీ వ్రతము

**ద్వాదశినాడు నీవు వ్రతివైయల రాముని భుక్త శేషమున్**
**మోదము తోడ ముద్దగొని పొందుగనీవతసీ ద్రుమూలమం**
**దోదనమందు పుష్పములనుంచి ప్రసాదము పంచి భక్తితో**
**ద్వాదశి దీక్షప్రీతులగు వారికి ధర్మము చూపు రక్ష నీ**
**వౌదు! సువర్చలాహృదయ వల్లభ సుందర వాయునందనా! 62**

వివరణ: హనుమంతుడు రాముని భుక్తశేషపు అన్నపుముద్దను తీసుకొని వెళ్ళి, అవిసె చెట్టు మొదట కూర్చొని దానిలో అవిసెపూలు కలిపి వానరులకు ఆ పుష్పాలను ప్రసాదంగా పంచాడు. ఇది ద్వాదశినాడు జరిగింది. ఈ విధంగా ఆంజనేయస్వామి పూజలో ద్వాదశి వ్రతము ప్రశస్తమైనది. (అతసీ ద్రుమం= అవిసె చెట్టు; నీవు+ ఔదువు)

## విషూచి వధ

**లంకిణి లంక రక్షకిని లాంగులకోలను కూల్చివేయగా**
**బింకము పూని సోదరి బిభిత్స విషూచి జిఘాంసి దండియై**
**రంకెల తోడుతన్ కవియ రండను మోదియు చంపి నావు నీ**
**వంకి సువర్చలాహృదయ వల్లభ సుందర వాయునందనా! 63**

వివరణ: ఆంజనేయస్వామి లంకిణిని కూల్చగా ఆమె చెల్లెలు విషూచి స్వామిపై ఒక దండముతో విరుచుకు పడ్డది. స్వామి ఆ ధూర్తురాలిని అదే దండముతో మోది చంపాడు.

లాంగలము= తోక; భిభిత్స= భేదించాలనే కోర్కె గలది.
జిఘాంసి= చంపాలనే కోర్కె గలది; దండి= దండము గలది.
రండ= దుర్మార్గురాలు.

## నాగవల్లీ దళార్చన

**రాముని నోటిరక్తిమము రంజిలు రమ్యవిలాస మేగతిన్**
**నామది నా హరించెనని యారసి మారుతి నాగ వల్లులన్**
**దామము జేసి మేనిపయి దాల్చెనటంచునుభక్తి నర్చనల్**

**నేమము గాగ జేసెదము నిక్కము తమ్మలపాకులన్ తమిన్**
**భామ! సువర్చలాహృదయ వల్లభ సుందర వాయునందనా! 64**

వివరణ: జానకీ రాముల నోరు ఎఱ్ఱబడటానికి కారణం తెలుసుకొన్న మారుతి వారికిష్టమైన తమలపాకుల దండలను శరీరానికి చుట్టుకొన్నాడు. ఆ విధంగా స్వామి నాగవల్లీ దళార్చనకు ప్రాధాన్య మేర్పడింది. (రక్తిమము= ఎఱుపు; దామము= దండ)

**కావగ రావయా! తమలపాకుల నర్చన జేతుమయ్య! దీ**
**నావన! దేహ రోగముల నాశము జేయగ, మాదు పిల్లలన్**
**దీవన లిచ్చి బ్రోవగను, దీక్షను పూజలు సేతు చూపు సత్**
**ప్రావ- సువర్చలాహృదయ వల్లభ సుందర వాయునందనా! 65**

వివరణ: దీన+ఆవన= దీనులను కాపాడు వాడా!
సత్+ప్రావ= మంచిదారి

**ద్వాదశ రుద్రరూపుడవు, వాయుతనూజుడవంజనా సుతా!**
**మేదుర భక్తితో కొలుచు మేటి నెలంతలు నాగవల్లి ప**
**త్రాది సమర్చనంబుగను, త్రాతవు నీవయి బ్రోచు రక్షనీ**
**వౌదు! సువర్చలాహృదయ వల్లభ సుందర వాయునందనా! 66**

వివరణ: రుద్రులు 11 మంది. రుద్రాంశతో పుట్టిన ఆంజనేయస్వామి 12వ రుద్రుడు. స్వామిని తమలపాకులతో అర్చించే మగువలను దయతో కాపాడుము స్వామీ! నీవే రక్ష.

(మేదుర= మిక్కిలి; రక్ష నీవ+ఔదు)

## లక్ష్మణ ప్రాణదాత

**నగమర చేతబట్టుకొని నాకనివాసులు నిర్నిమేషులై**
**మొగమిటు దించి చూడగ ప్రమోద గతుండ గదాధరుండవై**
**సొగసుగ రామలక్ష్మణుల శోషను బాపగ నేగు నీవ ప్రా**
**పగుదు! సువర్చలాహృదయ వల్లభ సుందర వాయునందనా! 67**

వివరణ: హనుమంతుడు సంజీవనీ పర్వతాన్ని ఒక అరచేతిలో పెట్టుకొని, మరొక చేతిలో గదను పట్టుకొని ఆకాశంలో వస్తుంటే స్వర్గం నుండి దేవతలు తలలు వంచి రెప్పలార్పక ఆశ్చర్యంతో చూస్తున్నారు.

నిర్ నిమేషులు= రెప్పపాటు లేనివారు. దేవతలు సహజంగానే రెప్పపాటులేని వారు; శోష= బాధ.

## భీమ గర్వభంగము

**తోక కదల్చలేక కడు తూలెను భీముడు ఖిన్నుడౌచు, న**
**స్తోక బలాఢ్యతన్ గనుచు సోదరుడంత నమస్కరించ న**
**వ్వీకది సర్వముంబరగ వీగెను, సత్యవివేకి యెన్నడున్**
**వీకది లేకయుంట తగు నెల్లెడమేలది యేరికైన ఋ**
**గ్వాకు సువర్చలాహృదయ వల్లభ సుందర వాయునందనా! 68**

వివరణ: భీముడు హనుమంతుని తోకను కదల్చలేక పోయాడు. సోదరుడైన హనుమంతునికి నమస్కరించి వినయాన్ని చాటుకొన్నాడు. ఏ విషయంలోను గర్వం లేకుండా ఉండుట విజ్ఞత. ఇది సత్యవాక్కు.

**పావన వాయుపుత్రుడగు పాండవుడుద్ధత భీమ విక్రమా**
**జీవుడు, నీదు సోదరుడు, జీర్ణ బలోద్ధతి, వాల జేయుడున్**
**జీవము గాంచె ఖర్వుడయి, జేతయు జయ్యుడు విక్రమార్కు లే**
**తావల గంధమాదన వితర్ది ప్రవిష్ఠ మహా తపస్వి- కా**
**పౌ- సువర్చలాహృదయ వల్లభ సుందర వాయునందనా! 69**

వివరణ: ఆంజనేయస్వామి! గొప్ప పరాక్రమంతో జీవించే నీ సోదరుడైన భీముడు తన బలగర్వాన్ని కోల్పోయాడు. జేత యైన నీవును జయ్యుడయిన భీముడును విక్రమం కలిగినవారే. గంధమాదన పర్వత వేదికపై తపోనిష్ఠలో నుండే తపస్వియైన వాయునందనా నీవే మాకు రక్ష.

(జయ్యుడు= జయింప బడేవాడు, జేత= జయించేవాడు. వితర్ది= వేది; అరుగు; తావలము= స్థానము; కాపు+ఔ= రక్షణ అగుము)

## సంస్తుతి

**పవన కుమార! నాపయి నపార దయామృత వర్ష ధారలన్**
**హవనముగాగ నెమ్మది నవాంకుర భావ వికాస సంపదల్**
**కవనము నందు నింపుకొని కానుక చేయ గడంగి నాడ చూ**
**వవని సువర్చలాహృదయ వల్లభ సుందర వాయునందనా! 70**

వివరణ: స్వామీ! నీ దయామృత వర్షముచే తడిసిన నా హృదయ భూమిలో మొలిసిన క్రొత్తభావాలను కవితలో నింపుకొని నీకు కానుకగా సమర్పించటానికి పూనుకున్నాను. నన్ననుగ్రహించు.

(అంకురము= మొలక; హవనము= యజ్ఞము; చూవె+అవని)

**తోయజ పత్రనేత్ర, కవితోక్తులతో నుతిచేయు నాహృదిన్**
**పాయక నిల్చి, పారము నపార ముదాన సువర్చలా పతీ!**
**వ్రాయక వ్రాయకన్ తుదకు వ్రాయగడంగితి తేర్చుమో, కడన్**
**వ్రాయ సువర్చలాహృదయ వల్లభ సుందర వాయునందనా! 71**

వివరణ: పారము= తీరము; అపారముదాన= అంతులేని ఆనందంతో కడన్ తేర్చుమో= చివరి వరకు వ్రాయటాన్ని కొనసాగింపజేయుము.

**రాయిడిపెట్టు భావ భవ రాగపు రోగని పీడితుండనే**
**వాయు కుమార! వాలమున పాపవిమోచితు చేయగా ననున్**
**డాయగ రమ్ము స్వామి! కడు డస్సితి! నీ దయరోగ దుఃఖముల్**
**వాయ! సువర్చలాహృదయ వల్లభ సుందర వాయునందనా! 72**

వివరణ: వాయునందనా! నామనస్సున రాపిడి పెడుతున్న సాంసారిక రాగమనే రోగాలను, నీ పెద్దతోకతో తోలి నన్ను పాపవిముక్తుని చేయుము స్వామీ! మిక్కిలి అలసిపోయాను. నీవు వచ్చి దయతో దుఃఖ రోగాలను పోగొట్టు.

**బీటలు వారె నా హృదయ పీఠిక మోహ విమోహ భావనా**
**గాటము చేత నో హనుమ! కానుక చేతును భక్తితో మనో**

**హాటక పీఠివై కవన హారతి గైకొను నాకు దిక్కు నీ**

**వౌట! సువర్చలాహృదయ వల్లభ సుందర వాయునందనా! 73**

వివరణ: వాయునందనా! నా హృదయమనే ఆసనం తీవ్రమైన రాగ విరాగాలతో బ్రద్దలైంది. స్వామి! నీవు నా హృదయమును బంగారు పీఠంగా చేసుకొని కొర్చొని నేనిచ్చే కవితా హారతులను స్వీకరించు. నాకు రక్ష నీవే కనుక నిన్నే వేడు కొంటున్నాను.

(పీఠిక= ఆసనము; పీట; హాటకము= బంగారము,; నీవు+ఔటన్= నీవగుటచేత)

**మారుతి! ఆంజనేయ! హనుమా! యని కేసరి పుత్త్రయంచు నె**

**మ్మారు సువర్చలా ప్రియుడ! మాటికి బిల్చిన పల్క వౌర! రా**

**మా! రఘురామ! రార! యని మానసమందున పిల్వ వత్తు విం**

**పార! సువర్చలాహృదయ వల్లభ సుందర వాయునందనా! 74**

వివరణ: కేసరి వానర రాజు. ఆయన భార్య అంజనీదేవి. ఆమె తపోదీక్షలో ఉండగా వాయువు రోజూ ఒక పండును ఆమె చేతుల్లో విసిరి వేసేవాడు. ఆ ఫలాన్ని ఆమె స్వీకరించేది. ఒకనాడు వానర రూపాల్లో విహరిస్తున్నారు పార్వతీ పరమేశ్వరులు. అప్పుడు పతనమైన రేతో భూతమైన శివుని తేజస్సును వాయువు ఫలరూపంలో అంజనాదేవి వడిలో వేసాడు. దానిని భక్షించిన ఆమె గర్భవతి యైంది. కలత చెందిన అంజనాదేవిని వాయువు ఓదార్చి కుమారుని తాను అన్నివిధాల రక్షిస్తానని చెప్పాడు. అలా ఆమెకు హనుమంతుడు పుట్టాడు. అంజనీదేవికి కొడుకు కాబట్టి ఆంజనేయుడు అని; వాయుదేవుని కారణంగా పుట్టటం వలన మారుతి, వాయునందనుడు అని; అంజనాదేవి భర్త 'కేసరి' కావున కేసరిపుత్రుడు అని పేర్లు వచ్చాయి. ఏ పేరుతో పిలిచినా పలకని హనుమ రామా! అని రాముని ధ్యానించ గానే ప్రత్యక్షమౌతాడు.

**భక్తిని నిన్నుగొల్చి, తనివార ప్రదక్షిణ మాచరించి, భా**

**వోక్తుల సంస్తుతించియు, నవోదయ మోహపుభావ వీచికా**

**రక్తిని, వీడ్వడన్ వలయు ప్రౌఢిమ కోల్పడు నన్నుబ్రోవు, వి**

**ద్వక్త సువర్చలాహృదయ వల్లభ సుందర వాయునందనా! 75**

వివరణ: వీచిక= కెరటము; విత్+వక్త: చక్కగా మాట్లాడే జ్ఞాని.

**నీలుని మీద చూపు దయ నేరము లెంచక చూపు నా పయిన్**
**వీలువడంగ దోలెదను వీసరవోవగ లోనివైరులన్,**
**కాలుని వోలె, పొందెదను కాలమెరుంగని సత్యసంపదల్**
**బాల సువర్చలాహృదయ వల్లభ సుందర వాయునందనా! 76**

వివరణ: నీలుడు విభీషణుని కొడుకు. హనుమ అనుగ్రహంతో దేవతలతో యుద్ధం చేసి ఇంద్రుని వద్ద ఉన్న చింతామణిని లంకకు తెచ్చాడు. నీవు నాపైన కూడ దయచూపిస్తే నాలోని శత్రువులను తరిమి కొడతాను. (వీసర వోవగ= తొలగిపోవునట్లుగ)

**నేమము తప్పి నా మనసు నిశ్చల తత్త్వము కోలుపోయెడిన్**
**స్వామివి నీవు నాకు, మనసారగ నీపదసేవజే తు, నే**
**సామము తోడ, నిన్ను బలసామజ! వేడెద దిక్కు నీవ కా!**
**స్వామి సువర్చలాహృదయ వల్లభ సుందర వాయునందనా! 77**

వివరణ: బలసామజ= ఏనుగు బలమువంటి బలముగలవాడా.
నీవ కాన్= నీవే అగుట వలన; సామము= స్తోత్రము.

**పంచముఖాంజనేయ! శృతిపాలక! భావి జగద్విధాత! హే**
**కుంచిత దీర్ఘదేహ! హృది కూజిత రామ సుమంత్ర! రామ భూ**
**పాంచిత వక్షసా! వివృత వాలహతాసుర బృంద! నీవనా**
**పంచ సువర్చలాహృదయ వల్లభ సుందర వాయునందనా! 78**

వివరణ: శృతి పాలక= వేదపాలకా! వివృత= పొడవైన
హత+అసుర బృంద= చంపబడిన రాక్షసులు గలవాడు
నా పంచ= నా దగ్గరుండుము.

**కొండల నెత్తుసామికిని గుండుల నెత్తుట లేమి లెక్క, యా**
**ఖండల జిత్తు జిత్తులను చిత్తుగ జేసిన అక్ష హంత, దో**

**ర్దండము లెత్తినం కలగు తండము భండనమందు నీవ కా**
**వండ! సువర్చలాహృదయ వల్లభ సుందర వాయునందనా!** 79

వివరణ: ఆఖండలజిత్తు= ఇంద్రుని ఓడించినవాడు ఇంద్రజిత్తు.
అక్ష హంత= అక్షకుమారుని చంపినవాడు.
దోర్దండములు= దృఢమైన బాహువులు; తండము= గుంపు
భండనము= యుద్ధము; కావన్+అండ= కాచు రక్ష
కలగున్= కలత పడును.

**రావణ బారి నుండపుడు రాముని భార్యను బ్రోచితీవు, మై**
**రావణబారినుండి యును రాముని లక్ష్మణు బ్రోచినాడ వే**
**రావము లేని జీవన విరామము నీయగ చూపు మీవ సత్**
**ప్రావ సువర్చలాహృదయ వల్లభ సుందర వాయునందనా!** 80

వివరణ: రావము లేని= ప్రశాంతమైన; సత్ప్రావ= మంచిదారి.

**ఆపద లాహరించుట, నయాచిత సంపదలిచ్చి తన్పుటన్**
**వ్యాపక మూర్తియైన రఘువంశ సుధాకరు నామ మంత్రమున్**
**ఆపక లో జపించుటయు, నంజని పుత్రుని సొత్తు పాపముల్**
**వాపు సువర్చలాహృదయ వల్లభ సుందర వాయునందనా!** 81

వివరణ: ఆపదలు+ఆహరించుట= కష్టములను పోగొట్టుట
తన్పుట= తృప్తి పరచుట

**అక్షకుమారవీర పరిహంతకు, యక్షులరాజ శత్రులన్**
**రాక్షస శిక్షకున్, విపుల రావణలంక వినాశ కారకున్,**
**వీక్షిత జానకీ హృదయవేత్తకు నర్చన సేతు నిల్వనా**
**పక్షి సువర్చలాహృదయ వల్లభ సుందర వాయునందనా!** 82

వివరణ: యక్షుల రాజు శత్రులన్= యక్షుల రాజైన కుబేరుని శత్రువులు.
రాక్షసులు; వీక్షిత= చూడబడిన; జానకీ హృదయ వేత్తకు= సీతాదేవి

హృదయము తెలిసిన వాడైన ఆంజనేయస్వామికి,
నిల్వ నా పక్షి= నా పక్షమున నిలుబడుటకు

**నమ్మితి రామచంద్ర చరణాంబుజ సుందర చంచరీకమున్**
**నమ్మితి లక్ష్మణార్తినట నాశము చేసిన ప్రాణదాత నే**
**నమ్మితి రామలక్ష్మణుల నచ్యుత భక్తుని, రక్ష నీవ గా**
**వమ్మ! సువర్చలాహృదయ వల్లభ సుందర వాయునందనా! 83**

వివరణ: రామచంద్రుని పాద పద్మముల వద్ద సంచరించె అందమైన తుమ్మెదవంటి ఆంజనేయుని, లక్ష్మణునకు ప్రాణదానం చేసి దుఃఖమును పోగొట్టిన వానిని, చిరంజీవియై వర్థిల్లు రామలక్ష్మణుల భక్తుని నేను నమ్ముకున్నాను. అమ్మ సువర్చలా దేవి హృదయ వల్లభుడవైన సుందరమూర్తివైన వాయునందనా నీవే నాకు రక్ష.

**వానర నాయకా! నుతులు వాయుకుమారుడ! ఉష్ట్రవాహనా!**
**మానిత దేవతాప్రియ! సమాశ్వసితాశ్రిత భక్త! మారుతీ!**
**కానుక సేతు నీకు మది కంజము, చిప్పిలు భక్తి తేనె నీ**
**వాన, సువర్చలాహృదయ వల్లభ సుందర వాయునందనా! 84**

వివరణ: సమాశ్విసిత+ఆశ్రిత భక్తి= ఆశ్రయించిన భక్తులను ఓదార్చువాడా!
హృది కంజము= హృదయమనే పద్మము; ఉష్ట్రము= ఒంటె
నీవు+ఆనన్= నీవు త్రాగుటకు

**రాముని సేవజేసి యనురాగము తోడను పొందినాడ వా**
**రాముని జానకీ హృదయ రాముని, భక్త మనోరమా రమున్,**
**కాముని గేలిసేయు హృదికమ్మెడి పూరుష మోహనాంగునిన్,**
**రాముని నిండు కౌగిలిని రంజిలు జానకి- యద్దినీకె యౌ!**
**భామ సువర్చలాహృదయ వల్లభ సుందర వాయునందనా! 85**

వివరణ: పూరుష మోహనాంగుని= పుంసాం మోహన రూపాయ

**రాముని కౌగిలిన్ తమిని రక్తిని చెందెడి భాగ్యమబ్బెరా**
**స్వామికి దాసుకున్ గనగ సామ్యము భేదము లేని చిన్మయా**
**రాముని సాక్షిగా గొలుతు రమ్మని పిల్వర ముక్తి నీయరా!**
**భామ! సువర్చలాహృదయ వల్లభ సుందర వాయునందనా! 86**

**వందన మీవు నందుకొనవయ్య సుధీ వినుతోర్ధ్వరేతసా!**
**వందన మీవు నందు కొనవయ్య సుదంచిత స్వర్ణ తేజసా!**
**వందన మీవు నందు కొనవయ్య మహేశ్వరునగ్ని తేజసా!**
**బందు సువర్చలాహృదయ వల్లభ సుందర వాయునందనా! 87**

వివరణ: ఊర్ధ్వ రేతసుడు= నిరంతర బ్రహ్మచర్య వ్రతుడు. రేతస్సును ఊర్ధ్వ ముఖంగా పయనింపజేసి నిరోధించినవాడు.
బందు= బంధువు.

**వందనమీవు నందుకొనవయ్య రమానుత రుద్రనందనా!**
**వందనమీవు నందుకొనవయ్య సురార్చిత కీశనందనా!**
**వందనమీవు నందుకొనవయ్య సుపూజిత భక్తనందనా!**
**బందు సువర్చలాహృదయ వల్లభ సుందర వాయునందనా! 88**

వివరణ: కీశ నందనా= వానర నందనా
బందు= బంధుడవైన ఓ ఆంజనేయ
భక్తి నందనా= భక్తులకు ఆనందమును కలిగించువాడా!

**సింధుర మద్ది చేతు నుతి, సేమము గూర్చుము సింధులంఘనా!**
**గంధము చర్చజేసి మది గానము సేయుదు కావు మచ్యుతా!**
**బంధము త్రెంచి వేగ నను బంధితు సేయుము పాద సన్నిధిన్**
**బంధు సువర్చలాహృదయ వల్లభ సుందర వాయునందనా! 89**

వివరణ: సింధులంఘనా= సముద్రమును దూకి దాటినవాడా!
చర్చ చేసి= అలది, పూసి.

**కోరిక లన్నియున్ కుదవగొందువు గాని, మదీయ శత్రులన్**
**పారగ ద్రోలి నీ చెరను బంధన సేయుము, నిశ్చలత్వమే**
**పారగ శాంతి దాయకుడవై నను గాచెడి తత్త్వ రూపు నీ**
**వౌర! సువర్చలాహృదయ వల్లభ సుందర వాయునందనా! 90**

వివరణ: నా మనస్సులోని కోరికలన్నింటిని నీ దగ్గర కుదవ పెడతాను. దానికి ఫలితంగా నాలోని శత్రువులను తరిమివేసి నన్ను నీ భక్తి చెరలో వేయి. నాకు నిశ్చలత్వమును ప్రసాదించే తత్త్వరూపుడవు నీవే స్వామీ!

**శరణ మటన్నవారి నిల సంతస మొందగ కాచువాడ వీ**
**వరయ, యయాతి రక్షణకు సామి నెదిర్చియు భక్తి యుక్తి త**
**త్పరత జయంబు నొందితివి పాహి కృపాకర! దీన పాలకా!**
**వరద! సువర్చలాహృదయ వల్లభ సుందర వాయునందనా! 91**

**రాయిని నాతిజేసె రఘురాముడు రామపదాను షంగతిన్**
**రాయిడిచేసి నాతిని పరాయి చెఱన్నిడె, మాతసీతనౌ**
**రాయని దేవతల్ వొగడ రాముని చెంతకు చేర్చు సామి వీ**
**వాయె సువర్చలాహృదయ వల్లభ సుందర వాయునందనా! 92**

వివరణ: నాతి= స్త్రీ; రామపదానుషంగితిన్= రమ్యమైన పదముల తాకిడితో; రాయిడి చేసి= కష్టాలు పెట్టి

**కింపురుషాఖ్య వర్షమున కీశులకిమ్మగు గంధమాదనం**
**బింపగు పర్వతమ్ముపయి పెంపగరంటి వనంబునందు భా**
**వింపగ కామరూపమున విశ్రమణంబునుపొంది పారిజా**
**తంపు సువృక్షమూలమున, తప్పక కావుము, శాశ్వతుండ శో**
**భంపు సువర్చలాహృదయ వల్లభ సుందర వాయునందనా! 93**

విద్దెలనిచ్చి పెంచుమవి వేకపు జాడ్యము మాసిపోవ వే
గద్దెల నెక్కి నీదు ఘన గాథను గానముసేయజాలు ధీ
నొద్దిక మాకొసంగు మయ! నూతనవిద్యల, శీర్షమాన్తు నీ
వద్ద సువర్చలాహృదయ వల్లభ సుందర వాయునందనా! 94

సతత విచార వర్తనులు చక్కని విద్యల నేర్పరుల్ కటా
వ్రతములు సల్పుచుండి రదె వారికి జీవిక నిచ్చి గావుమా
క్రతువుల నెన్ని జేసినను కామ్యము తీర్చగలట్టి మార్గ మీ
వ– తుది సువర్చలాహృదయ వల్లభ సుందర వాయునందనా! 95

వివరణ: క్రతువు= యజ్ఞము; కామ్యము= కోరదగినది; తుది= చివరకు.

మానస మందు నిన్దలచి మానుగ చాలిస పాడువారికిన్
కానిపనన్న దేదియును కానదదెన్నడు, మంగళంబగున్
పూని ప్రదక్షిణంబులను పోడిమి చేయగ భక్తి తత్త్వమిం
పౌను సువర్చలాహృదయ వల్లభ సుందర వాయునందనా! 96

నీకును పూజసేయగను నీలుడు పొందెను రాజ పీఠమున్
నీకును పూజ చేసిన వినీతుడు మైందుడు జేయు డయ్యెడిన్
నీకును పూజ చేసినను నిత్య సుఖంబులు కల్గు సత్యమీ
వాకు– సువర్చలాహృదయ వల్లభ సుందర వాయునందనా! 97

కదళి ఫలాలు, పాయస ప్రకల్ప సుగంధపు తీపి పొంగలుల్
సదయుడవైన నీకును ప్రసాద సమర్పణ చేయుచుంటిమో
కుదురగు భక్తి నీయగను కోరుచు నుంటి దయాళ! రక్షనీ
వరయ! సువర్చలాహృదయ వల్లభ సుందర వాయునందనా! 98

**చదువులు సక్రమంబుగను సాగును నీ పద సేవ చేసినన్**
**పదవులు వచ్చి చేరునవి పాయక నిన్ను నుతించు వారికిన్**
**సదమల భక్తి గొల్చిన నశక్తులగున్ శని రాహుకేతులున్**
**కుదురు సుకన్యకా మణుల కుద్వహ బంధము లాను కూల్యమై**
**కుదురువు నీవు సర్వములకున్ లయుడీవ మూలమీ**
**బ్రదుకు సువర్చలాహృదయ వల్లభ సుందర వాయునందనా! 99**

## లడ్డుల ప్రియుడు

**తరగలనెత్తి వచ్చి గుడి తల్పుల తాకు సముద్రునాపగా**
**నరయగ కాపలా హనుమయంకితబుద్ధి యటంచు నుంచగా**
**తరగని జిహ్వచాపలముతో చన తీయని లడ్డు కోసమై**
**యరసిన రాముడందరును నారయ కట్టెగ! బేడి మారుతీ**
**వరయ సువర్చలాహృదయ వల్లభ సుందర వాయునందనా! 100**

వివరణ: ఒకప్పుడు పూరీ జగన్నాథుని ఆలయం సముద్ర కెరటాలలో మునిగి పోతుండేది. రాముడు అక్కడ హనుమను కాపలా పెట్టాడు. హనుమకు భయపడి సముద్రుడు పొంగటం మానేసాడు. హనుమ లడ్డుల మీది ప్రీతితో రాత్రివేళలలో అయోధ్యకు వెళ్ళేవాడు. హనుమంతుడు లేనప్పుడు సముద్రము మళ్ళీ పొంగేది. రాముడు హనుమను సముద్రం దగ్గరే బేడీలతో బంధించాడు. అప్పటి నుండి సముద్రమ పొంగటం లేదు. అప్పటినుండి జగన్నాథునికి లడ్డూల నైవేధ్యం జరుగుతుంది. అక్కడ సముద్రపు ఒడ్డున గొలుసులతో కట్టిన హనుమాన్ దర్శనమిస్తాడు. ఆయనను “బేడీ హనుమాన్” అంటారు.

## సీతారామ లక్ష్మణదాసుడు

**ఈదరి లక్ష్మణుండెలమి యింపుగ సీతయు మధ్యరాముడున్**
**వేదినలంకరింపగను, వేదికి క్రిందుగ పార్శ్వమందునన్,**
**పాదము నొక్కటిన్ మడిచి, పాదమదొక్కటి నేలనాన్చి, స**
**మ్మోదము తోడుతన్ ముడుచి పొందగు వాలము, మోడ్చి చేతుల**

**న్నాదర మొప్పవందనము నౌదల జేయు మహేశ సంభవుం**
**డీ దరి కూర్చొనం గనగ నీక్షలు జాలవు భక్తకోటికిన్**
**సాధు! సువర్చలాహృదయ వల్లభ సుందర వాయునందనా!** **101**

వివరణ: ఉభయ పార్శ్వముల పీతాలక్ష్మణులతో రాముడు కొలువైయుండగా, దిగువ కుడివైపున ఉత్తర ముఖంగా ఒక కాలు నేలకు మడిచి, మరొక కాలి పాదాన్ని నేలపై మోపి, వాలాన్ని ముడిచి, చేతులు ముకుళించి, నిరంతర సేవకు సంసిద్ధుడైన స్థితిలో కూర్చొన్న రామదాసును, సీతాలక్ష్మణులను చూడటానికి రెండు కళ్ళు చాలవు.

## యత్ర యత్ర రఘునాథ కీర్తనమ్

**ముచ్చట గాగనీ భువిని మోదమెలర్పగ రామకీర్తనం**
**బెచ్చట కర్ణపేయముగ విందులు చేయునొయచ్చటీవెగా**
**క్రచ్చర నేగుదెంచెదవు కావగ రాముడు పొందగా ముదం**
**బచ్చ సువర్చలాహృదయ వల్లభ సుందర వాయునందనా!** **102**

వివరణ: క్రచ్చర= వెంటనే; అచ్ఛ= పవిత్రమైన
కర్ణపేయము= చెవులకింపుగా.

**శ్రీ రఘు రామ నామ రస సీధువు పానము జేయు నాకు నీ**
**దౌ రమ ణీయ దర్శనము తారణ పొందగ గల్గెనేమొ దై**
**వారగ వాక్కు నందు నెలవై కృతి జేయగ నిమ్ము భాగ్యమిం**
**పార సువర్చలాహృదయ వల్లభ సుందర వాయునందనా!** **103**

వివరణ: ఓ స్వామీ! వాయునందనా! సంసార సాగరాన్ని దాటేశక్తి కోసం రామనామ మనే మధువును త్రాగుతున్న నాకు నీ దర్శనము లభించినది. నా వాక్కున నిలచి రచన చేసే భాగ్యాన్ని ప్రసాదింప ప్రార్థిస్తున్నాను.

## పంచముఖ ఆంజనేయస్వామి

**వానర నారసింహ ముఖ వైనత క్రోడ హయంపు మోములన్**

**మానుగ ప్రాఙ్ముఖాదికమునై. అరుణాంబర ధారియైన పం**
**చాననుఁ పక్షవీక్షణు దశాయుధ ధారణ హస్త! చూడనిం**
**పౌను! సువర్చలాహృదయ వల్లభ సుందర వాయునందనా!** **104**

వివరణ: తూర్పు, దక్షిణ పడమర ఊర్ధ్వదిశలను చూస్తూ వానర, నారసింహ గరుడ, వరాహ అశ్వముఖములు కలిగి ఎఱ్ఱని వస్త్రము 15 కళ్ళతో, 10 ఆయుధాలతో పంచముఖ ఆంజనేయస్వామి దర్శనమిస్తాడు.

(వైనతము= వినత కొడుకు గరుడుడు గరుత్మంతుని ముఖము

క్రోడ= వరాహము; ప్రాక్+ముఖ+ఆదికము; పంచానను= 5 ముఖములు కలిగినవానిని; పక్ష వీక్షణున్= 15 కన్నులు గలవానిని.

**పంచముఖాంజనేయ వరపావన మంత్ర జపంబు జేసి తా**
**కొంచక తారకుందునిమె నూర్జిత తేజుడు షణ్ముఖుండ హో!**
**సంచిత పాపముల్దొలగు షండునకేనియు నిన్ను గొల్వ సూ**
**వాంఛ! సువర్చలాహృదయ వల్లభ సుందర వాయునందనా!** **105**

వివరణ: కుమారస్వామి పంచముఖాంజనేయ మంత్రాన్ని జపించి, స్వామి అనుగ్రహంతో, గొప్ప తేజస్సుతో తారకాసురుని చంపాడు.

(ఊర్జిత తేజుడు= పెంపొందిన తేజస్సు గలవాడు; షండుడు= నాస్తికుడు)

## హనుమజ్జయంతి

**మహిత విశాఖ మాసము సమాహిత కృష్ణ సుపక్షమున్ శుభా**
**వహ దశమిన్నవాతర వానర రూపమునెత్తి యుత్సవం**
**బహమహ మీహ గాగ తని వందెడు భాగ్యమునిచ్చి నావు హే!**
**పాహి! సువర్చలాహృదయ వల్లభ సుందర వాయునందనా!** **106**

వివరణ: వైశాఖ బహుళ దశమి స్వామి వారి జయంతి- పర్వదినము.

"అహమహ మీహ..."= నేను నేను అను కోర్కెతో ఉత్సవమును జరుపుకొనే భాగ్యమునిచ్చావు. (ఈహ= కోరిక)

## కృతి సమర్పణమ్

సారస లోచనా విరహి, సారస లోచను రోచనాంగునిన్
సారపు చింతనన్ హృదయ సారసమందు రమింప జేయుచున్
కోరగ నీవయై సుకృతి గూర్చగ జేసిన నీకు వందనం
బేరతి లేక నీ కృతిని నిచ్చితి నీకిదె తీసికొమ్ము మీ
వౌర! సువర్చలాహృదయ వల్లభ సుందర వాయునందనా! **107**

## మంగళమ్

వరమిడు! జానకీ హృదయ వల్లభ సుందర రామచంద్రుడా!
వరమిడు! ఊర్మిళా హృదయ వల్లభ సుందర శేష లక్ష్మణా!
పరమ సువర్చలాహృదయ వల్లభ సుందర వాయునందనా!
పరమగు హారతింగొనుచు, పారము జేరిచి ముక్తి నీయరే! **108**

---

మంగళమ్ కౌసలేంద్రాయ
మహనీయ గుణాత్మనే
చక్రవర్తి తనూజాయ
సార్వభౌమాయ మంగళమ్

## శుభమ్

# కవి పరిచయం



**రచయిత:** **తుమ్మోజు రామలక్ష్మణాచార్యులు**

భార్య: కనక సుమన

జననం: 15-02-1953

స్వగ్రామం: రమణక్కపేట, ముసునూరు మండలం, కృష్ణాజిల్లా

తలిదండ్రులు: కీ.శే. చంద్రశేఖర భుజంగాచార్యులు, కీ.శే. లక్ష్మీనరసమ్మ

విద్యాభ్యాసం: 1) ఎస్.ఎస్.ఎల్.సి. 1969 జిల్లా పరిషత్తు ఉన్నత పాఠశాల, రమణక్కపేట, ముసునూరు మండలం, కృష్ణాజిల్లా

2) భాషాప్రవీణ, 1974 శ్రీమార్కండేయ ఓరియంటల్. కళాశాల, ఆకిరిపల్లి, కృష్ణాజిల్లా

3) పి.ఒ.ఎల్, 1977 ఆంధ్ర విశ్వకళా పరిషత్తు

4) ఎం.ఏ 1979 ఆంధ్రవిశ్వకళా పరిషత్తు

5) పండిత ఉపాధ్యాయశిక్షణ, 1981 ఎస్.ఎం.ఎస్, టి.పి.టి.కాలేజి, ప్రొద్దుటూరు, కడపజిల్లా

ఉద్యోగం: 1) ప్రవేశం: 11-8-1976 ద్వితీయ శ్రేణి తెలుగు పండితునిగా

విరమణ: 28-2-2011 ప్రథమశ్రేణి తెలుగు పండితునిగా

| | |
|---|---|
| వ్యాసంగం: | పద్యకావ్య పఠనం, కవితా రచన, కవిసమ్మేళనాలలో పద్య కవిత వినిపించటం, అవధానాలలో పృచ్ఛకునిగా పాల్గొనటం, సాహిత్య ఉపన్యాసాలివ్వటం. |
| ముద్రితాలు: | 'భారతి' మాసపత్రిక 1988 ఏప్రిల్ సంచికలో 'ఆరంజోతి' దీర్ఘకవిత మొదటగా అచ్చయినది. 'ఆంధ్రజ్యోతి, దిన, వార పత్రికలలో... |
| గ్రంథాలు: | ఈ "సువర్చలా సుందర వాయునందన శతకం" మొదటగా అచ్చయిన గ్రంథం. |
| సత్కారాలు: | 1) 17-11-1996న ఉయ్యూరు సాహితీ మండలి సభలో శ్రీ గబ్బిట దుర్గాప్రసాద్ గారిచే లంక బసవాచారి స్మారక "భవానీ మృత్యుంజయ" విశిష్ట సాహితీ పురస్కారం<br>2) 15-9-2009న గుడివాడలో 'అమ్మ ఛారిటబుల్ ట్రస్ట్' (శ్రీ మాటూరి రంగనాథ్) వారిచే సత్కారం.<br>3) 2012లో గుడివాడ భారతీ సమితి వారి సత్కారం |
| సంతానం: | 1) కుమార్తె: చి॥ ల॥ సౌ॥ అమృతలూరి శశాంక దీప్తి ఎం.సి.ఎ.<br>అల్లుడు: చి॥ లక్ష్మీ వెంకట ఫణికుమార్. బి.టెక్'<br>మనుమరాలు: చి॥ హంసిని<br>2) కుమారుడు: చి॥ శ్రీభానుతేజస్వి బి.ఫార్మశి. |



**శ్రీ సువర్చలాంజనేయ స్వామి దేవస్థానం ధర్మకర్తలు**
**శ్రీ గబ్బిట దుర్గాప్రసాద్, శ్రీమతి ప్రభావతి దంపతులు**